


Did you know—in the recorded history of mankind, there has not been a single day without war. Peace is a rare commodity. Preserve it in the streets and in your albums. Chinar has an irresistible collection specially imported for genuine collectors like you.

**Choose from over 20 themes**

Special packets have been made for you under various themes or topics ranging from stamps on space, sports, animals, transport, art, flowers etc. (see coupon for details) to add to your collection. Take your pick.

**Send the coupon or simply write to us**

You can either fill in the coupon or choose your favourite topic and write to us on a postcard, inland letter or on plain paper.

- If you order by VPP, minimum order should be
  Rs. 50.00 + Rs. 7.00 for postage.
- If you pay in advance, minimum order should be
  Rs. 25.00 + Rs. 5.00 for postage.
- *Please add 10% Sales Tax on value of stamps for all orders. (only 7% for Delhi).*
- Postage will be free on all orders of Rs. 100.00 or above.
- For VPP orders, make sure of your parents permission.




## Hurry! Mail your order today:

Circle the packets you want

| Themes | stamps 10 | 25 | 50 | 100 |
|---|---|---|---|---|
| Space | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Sport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Transport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Art | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Flowers | 3.75 | 8.00 | 15.00 | — |
| Fauna | 3.75 | 8.00 | 15.00 | — |
| Marine/Sea life | 3.75 | 8.00 | 15.00 | 30.00* |
| Paintings | 3.75 | 8.00 | 15.00 | — |
| Lenin | 3.75 | 8.00 | 15.00 | 25.00** |
| Flora & Fauna | — | — | — | 35.00 |
| Moscow | — | — | — | 30.00 |
| Siberia & Far East | — | — | 30.00*** | — |
| Peace & Friendship | — | 8.00 | — | 25.00 |
| October Revolution | 3.75 | — | — | 25.00 |
| Assorted | 3.75 | 8.00 | 15.00 | 25.00 |

** 90 stamps ** 85 stamps *** 53 stamps*

Name .................................... Age ....................

Address ....................................................

Payment ☐ V.P.P. order ☐

**CHINAR-Sole distributors and importers of USSR stamps for genuine collectors**

*STAMPS The hobby that sticks with you*



CHINAR EXPORTS PVT LTD
Regd. Office : 101-A, Surya Kiran
Kasturba Gandhi Marg, New Delhi-110 001

INK CE 891



# చందమామ

జనవరి 1987



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

# వనిత

డాల్టన్ ప్రచురణ

దశాబ్దానికి పైగా మూడు భాషలలో
వెలువడుతూ వనితల
పురోభివృద్ధికి పాటుబడుతున్న
ఏకైక స్త్రీజన మాసపత్రిక!




డిసెంబర్
1986




జూలై
1975

నేడే చందాదారులుగా చేరండి
మీలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించే
మీ నెచ్చెలి
**వనిత**
మీ ముంగిటికే రప్పించుకోండి!

సాలు చందా: రూ 36

ఎం.ఓ. ద్వారాగానీ బ్యాంక్ డ్రాఫ్ట్ ద్వారాగానీ పంపవలసిన చిరునామా

వనిత (తెలుగు), డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు—600 026




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ప్రాణంవిలువ"]కు ఆధారం, బొమ్మిడి అచ్చారావు రచన. లోకంలో పనికిరాని వస్తువంటూ ఏదీ లేదనేదాంట్లో, చాలా వాస్తవం వున్నది. అయితే, మనిషి తన విచక్షణాజ్ఞానాన్ని ఉపయోగించకుండా, దొరికినవాటి నన్నిటినీ ఇంట జేర్చడంవల్ల, నవ్వులపాలు కావలసి వస్తుంది. ఈ విషయం, చక్కని హాస్యధోరణిలో, ''అతిజాగ్రత్త'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

సుహృదాం హితకామానాం యః, శృణోతి న భాషితమ్,
విపత్ సన్నిహితా తస్య, స నరః శత్రునందనః.

[తన మేలు కోరే సహృదయులైన మిత్రుల సలహాలను పాటించని మానవుడు, ఆపదలను కోరి తెచ్చుకుంటాడు; తన శత్రువులకు ఆనందం కలిగిస్తాడు.]

సంపుటి 80 జనవరి '87 సంచిక 1

విడి ప్రతి : 2–50 :: సంవత్సర చందా : 30–00

CHITRA



# మిఠాయిల మహారాజు లోపలంతా
# చాక్‌లెట్ పెట్టి ఎక్లెయిర్‌లు బహూకరిస్తున్నాడు






# చాకొలెట్ ఎక్లెయిర్‌లు



బయట చూస్తే అది టాఫీ—మరి నోట్లో
వేసుకుంటే నోరూరించే ప్యారీస్
చాకొలెట్‌గా మారిపోతుంది! ప్యారీస్ ఎక్లె
యిర్‌లు అని అడగాలి



పూర్తిగా చాక్‌లెట్‌తో
నిండిన ఎక్లెయిర్



నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:

కారమిల్క్ • ట్రై-మా
చాకొలెట్ ఎక్లెయిర్స్
కోకోనెట్ పంచ్
చాక్లెయిర్స్ • కోకోనెట్ క్రీమ్
లాల్లీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో
మొట్టమొదటి పేరు

PCL 1830

## చందమామ కబుర్లు



### బ్రహ్మాండమైన సొరచేప

లాంగ్ ఐలండ్ తీరంలో ఇటీవల ఒక జాలరి బ్రహ్మాండమైన తెల్ల సొరచేపను పట్టాడు. చాలా పెద్దదైన ఈ మహామత్స్యం 1,570 కి. గ్రా॥ బరువు ఉన్నది.

### అంతఃకంపం—భూకంపం

ఓరిగాన్‌కు చెందిన 34 సంవత్సరాల శ్రీమతి చార్లట్ కింగ్, తనకు తలనొప్పి అని ప్రభుత్వం వారికి ఫోన్ చేసినట్టయితే, అధికారులు త్వరలో భూకంపం రాగలదని గ్రహించి తగుజాగ్రత్తలు తీసుకుంటారు. ఇలా శ్రీమతి చార్లట్‌కు తలనొప్పి రావడమూ, వెనువెంటనే భూమి కంపించడమూ, ఆరుసార్లు జరిగింది. అతి సున్నితమైన భూచలనాలకు సైతం శ్రీమతి చార్లట్ ప్రభావితమవుతుందని డాక్టర్లు భావిస్తున్నారు.





### ఈతనేర్చిన కారు

రోడ్డు మీద నడిచినట్టే, నీళ్ళ మీద సైతం అతి సహజంగా నడిచే కారును కాలిఫోర్నియాలో ఒక సంస్థ కనుగొన్నది.

### మంచుచిరుతపులులు

దాదాపు అంతరించి పోయిందనుకున్న మంచుచిరుతపులులు ఇటీవల కులూలోయలో కనిపించాయి. వీటి చర్మం మంచి ధర పలుకుతుంది. కాబట్టి, వేటగాళ్ళ నుంచి ఈ జంతు సంతతిని రక్షించడానికి కట్టుదిట్టమైన జాగ్రత్తలు తీసుకుంటున్నారు।



# రజి

పురూరవచక్రవర్తి మనుమడయిన రజి వీరాధివీరుడుగా పేరు గాంచాడు. మానవులలోనే కాక, దేవదానవులలో సైతం ఆయనకు సాటిరాగల వీరుడు లేడన్న కీర్తి గడించాడు.

ఒకప్పుడు దేవదానవుల మధ్య యుద్ధం రగులుకునే సమయం ఆసన్నమయింది. అప్పుడు దేవతలు బ్రహ్మ దగ్గరికి వెళ్ళి, "యుద్ధంలో ఎవరు గెలుపొందగలరు?" అని అడిగారు.

"రజి ఎవరిపక్షం వహిస్తే వాళ్ళు విజయం సాధించగలరు," అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ చెప్పిన విషయం ఎలాగో రాక్షసులకు తెలిసిపోయింది. వాళ్ళు రజివద్దకు వెళ్ళి జరుగనున్న యుద్ధంలో తమ పక్షం వహించమని ఆయన్ను కోరారు.

"యుద్ధంలో గెలుపొందాక మీరు నన్ను మీ రాజుగా అంగీకరించేట్టయితే, యుద్ధంలో మీకు సాయపడడానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు రజి.

అందుకు రాక్షసులు అంగీకరించకుండా వెళ్ళిపోయారు.

ఆ తరవాత, దేవతలు రజిని ఆశ్రయించి, తమ కోరికను తెలియజేసి, యుద్ధానంతరం ఆయన్ను తమ రాజుగా చేయడానికి సమ్మతించారు.

దేవదానవుల యుద్ధం ప్రారంభమయింది. అనుకున్న విధంగానే రజి నాయకత్వంలో దేవతలు, రాక్షసుల మీద విజయం సాధించారు. అప్పుడు దేవేంద్రుడు, రజి వద్దకు వెళ్ళి, నమస్కరించి, "తండ్రీ, బిడ్డలను కాపాడే లాగా ఈ యుద్ధంలో మీరు మమ్మల్ని రక్షించారు," అన్నాడు.

"దేవతలయిన మీరు నన్ను మీ తండ్రిలాగా భావిస్తున్నారు. తండ్రి రాజ్యం తనయులకు సంక్రమిస్తుంది. కాని, తనయుల రాజ్యం తండ్రికి చెందదు, కదా! కాబట్టి మీ రాజ్యం మీరే ఏలుకోండి," అన్నాడు రజి తృప్తిగా నవ్వుతూ.





# అతిజాగ్రత్త

ఎర్రగుంట గ్రామంలో వుండే యతి రాజును, అతిజాగ్రత్త మనిషని గ్రామంలో అందరూ అంటూంటారు. అతడికి చిన్న తనంలోనే తల్లీ, తండ్రీ చనిపోగా, నాయనమ్మ పెంచి పెద్దచేసింది. కొద్దో గొప్పో ఆస్తితోపాటు, అతడికి మంచి ఉద్యోగం కూడా వున్నది.

యతిరాజు పొరుగు గ్రామంలోవున్న, విమల అనే అమ్మాయిని వివాహం ఆడాడు. అతడికి, ఆమె అంటే ప్రాణంతో సమానం. విమలకు కూడా భర్త అంటే ప్రాణమేకానీ, అతడు చూపే అతిజాగ్రత్త మాత్రం, తగని చిరాకు కలిగించేది.

రాత్రివేళల్లో యతిరాజు, ఇంటికి లోపలి గడియలు, ఒకటికి పదిసార్లు వేస్తూండేవాడు. కూరలవాళ్ళకూ, అంగడి వాళ్ళకూ చిల్లర డబ్బులు, మరీమరీ లెక్కపెట్టి ఇవ్వడం లాంటి జాగ్రత్తలతో పాటు, అతడికి మరొక అలవాటు కూడా వుండేది. అదేమంటే—అతడి దృష్టిలో నిరుపయోగమైన వస్తువంటూ ఏదీలేదు.

ఖాళీ అగ్గిపెట్టెలు, సబ్బుడొక్కులు, వెచ్చాల తాలూకు పొట్లాలదారాలు, కొబ్బరిపీచు, పాతకాగితాలు, మొదలైన వన్నీ యతిరాజు జాగ్రత్తగా దాస్తూంటాడు. ఎప్పటినుంచో అలా నిలవచేసిన అనవసర వస్తువులు, అతడి ఇంట్లో కుప్పలు తెప్పలుగా పడివుండేవి.

కాపరానికి వస్తూనే, ఇంటి వైనం చూసి చిరాకుపడిన విమల, నడుం బిగించి చెత్తంతా పోగుచేసి, వీధిలో పారవేయ బోయింది. అయితే, అప్పుడే బజారు నుంచి వస్తున్న యతిరాజు కొంపలంటు కున్నట్టు కేకవేసి, "అవన్నీ ఇంట్లో ఒక పక్క పడివుంటాయి. వాటి జోలికి వెళ్ళకు. ఇంతకాలం నేను పనిమాలా

గవ్వల నిర్మలాదేవి



దాస్తూ వచ్చింది, పారవేయడానికాక్కాదు!" అన్నాడు.

విమల ఆశ్చర్యంగా, "మరెందుకండీ, ఈ చెత్తంతా?" అన్నది.

యతిరాజు, భార్యకేసి పిచ్చిదాన్ని చూసినట్టు చూసి, "ఎందుకేమిటి? ఈ ప్రపంచంలో పనికిరాని వస్తువంటూ ఏదీ లేదు. ఈ పరమసత్యాన్ని, మా నాయనమ్మ నాకు నూరి పోసింది. ఆమె—అఖరికి పూచిక పుల్ల అయినా గాల్లో కొట్టుకు పోతూంటే చూసి విలవిల్లాడేది. ప్రతి వస్తువుకూ, దాని ప్రయోజనమంటూ ఒక టుంటుంది. ఎప్పుడు దేని అవసరం కలుగుతుందో చెప్పలేం గదా!" అన్నాడు.

విమల భర్త కేసి కొరకొర చూస్తూ, "ఈ చెత్తతో, మనకేం అవసరం కలుగుతుందో కాస్త చెప్పండి," అన్నది.

"అలా అడుగు, బావున్నది. సరే, చెప్పేది జాగ్రత్తగా విను. మనం అంగట్లో సరుకులు కొన్నప్పుడు, యీ అట్టపెట్టెలకు, కాగితాలకు, డబ్బాలకు, దారాలకు కలిపే డబ్బు చెల్లిస్తూంటాం, తెలుసా? అలాంటప్పుడు, వీటిని పారేయడం అంటే, మన డబ్బుకు మనమే చిచ్చుపెట్టినట్టు!" అని యతిరాజు, భార్యకు ఏవి సందర్భాలలో వాటిని ఉపయోగించుకోవచ్చో, ఒక అర్ధగంటసేపు వివరించాడు.

అయితే, నెలలు గడుస్తున్నా, వాటిని ఉపయోగించుకునే సందర్భం, ఆ భార్యాభర్తలకు కలగలేదు. పైగా, రోజు రోజుకూ ఇంట్లో చెత్తాచెదారం విపరీతంగా పెరగసాగింది.

ఒకసారి విమల స్నేహితురాలు, విమల కొత్తకాపరం ఎలా వుందో చూడడానికి వచ్చింది. ఆమె ఇల్లంతా చూశాక, "పెళ్ళి కాకముందు, ఇంటి శుభ్రత గురించి గొప్పగా కబుర్లు చెప్పేదానివి. మరిప్పుడు ఇంటిని యిలా అడవిలా వుంచావేమిటి?" అని అడిగింది.

విమలకు చాలా బాధ కలిగింది. అయినా, ఆమె భర్త చాదస్తం స్నేహితు

రాలిముందు బయటపెట్టుకోలేక, "రోజూ శుభ్రం చేయాలనుకుంటూనే బద్ధకిస్తున్నాను," అంటూ మాట దాటవేసింది.

ఆ రోజు, ఆమె భర్తతో, ఈ విషయం గురించి పెద్దగా గొడవ పెట్టుకున్నది. యతిరాజు కూడా బాగా కోపం తెచ్చుకుని, "ఇంతకాలం బుద్ధిలేకనే, అవన్నీ దాచాననుకుంటున్నావా? అసలు అవన్నీ ఒక పక్కన పడివుంటే, నీకొచ్చిన నష్టమేమిటి? ఏదో ఒక రోజు, వాటి ఉపయోగం తప్పక వస్తుంది, చూస్తూండు!" అన్నాడు.



విమలకు, రామేశమనే తమ్ముడున్నాడు. అతడు ఒకసారి అక్కను చూడడానికి వచ్చాడు; చాలా తెలివైన వాడు. విమల, భర్త చాదస్తం గురించి తమ్ముడితో చెప్పి, ఆయన్ని మార్చే ఉపాయమేదైనా ఆలోచించమన్నది.

రామేశానికూ్కడా, విమల ఇంట్లో పనికివచ్చే సామానుకన్న, పనికిరానివే ఎక్కువగా కనిపించినై. అతడు బాగా ఆలోచించి, విమలకు ఒక ఉపాయం చెప్పాడు. విమల మొదట సంశయించినా, తమ్ముడి తెలివితేటల మీద మంచి నమ్మకం వుండడం చేత, ఒప్పుకున్నది.

ఆ రాత్రి భోజనాలయాక, విమల రామేశానికి బయట పక్క వేసింది. యతిరాజు, విమలా మామూలుగానే ఇంట్లో పడుకున్నారు. యతిరాజు తన అలవాటుప్రకారం, తలుపులకు గడియలన్నీ, చివరిసారిగా తనిఖీ చేసి వచ్చి పడుకున్నాడు.

సరిగా అర్ధరాత్రివేళ, వంటగది వైపు నుంచి, ఏవో ధ్వనులు వినిపించడంతో, యతిరాజు ఉలిక్కిపడి లేచి, విమలను కూడా లేపాడు. ఇంతలో నల్లటిముసుగు ధరించిన వాడొకడు, వాళ్ళ ముందుకు దూకి, అక్కడ ఒక మూలగా పడివున్న ఖాళీ సీసాను తీసుకుని, దాన్ని గోడకు కొట్టి పగలకొట్టి, వాడిగా వున్న భాగాన్ని వాళ్ళకు గురిపెట్టాడు.

యతిరాజు భయంతో వణుకుతూ, అరవబోయేంతలో, ముసుగువాడు, "అరిచారంటే, యీ చేతిలో వున్న సీసాతో పొడుస్తాను. మర్యాదగా, అ గుంజ దగ్గిరకు నడవండి," అన్నాడు కర్కశంగా.

ముసుగువాడి గొంతు భయంకరంగా ధ్వనించింది. అప్పటికే నిలువునా వణికి పోతున్న యతిరాజు, కిక్కురుమనకుండా గుంజదగ్గిరకు నడిచాడు. అతడి వెనకగా విమల నడిచింది. ముసుగువాడు అక్కడ మూల పడివున్న దారాలనూ, పురితాళ్లనూ తెచ్చి, యతిరాజునూ, విమలనూ వాటితో గుంజకు కట్టివేశాడు.

తర్వాత, వాడు మరొకసారి వాళ్ళను అరవొద్దని హెచ్చరించి, తాళంచెవులు తీసుకుని, తాపీగా పెట్టెలు తెరిచి, డబ్బూ, నగలూ, విలువైన బట్టలూ ఒక మూట కట్టాడు. వంటగదిలోకి పోయి, పాత్ర సామగ్రినంతా ఒక గోతానికెత్తాడు. యతిరాజూ, విమలా నిలువుగుడ్లతో వాణ్ణి చూడసాగారు.

పని పూర్తికాగానే వాడు, యతిరాజు ముందుకువచ్చి, "ఈ రోజు దొంగతనానికి అనుకోకుండా బయలుదేరాను. అందు వల్లే, వెంట కత్తీ, తాళ్ళూ తెచ్చుకోలేదు. అయినా, మీ ఇంట్లో నా పని సులువుగా తెమిలిపోయింది. అందరూ మీలాగే ఇంటి నిండా, ఇలా మాకు పనికొచ్చే వస్తువులు పోగుచేసి తయారుగా వుంచితే, మాకు కత్తులూ, తాళ్ళూ గట్రా ఇంటింటికీ



మోసుకువెళ్ళే మోతపని తప్పుతుంది,'' అన్నాడు.

తర్వాత ముసుగువాడు, ఇంటి నాలుగు గదులూ తిరిగి వచ్చి, ''నేను ఏ ఇంట్లో దొంగతనం చేసినా, వెళ్ళేటప్పుడు, ఆ ఇంటిని తగలబెట్టడం ఆచారం. ఇప్పుడా పని చేయబోతున్నాను,'' అన్నాడు.

యతిరాజు అతి ప్రయత్నం మీద గొంతు పెగుల్చుకుని, ''ఇంట్లో వున్న డబ్బూ, విలువైన వస్తువులూ—అన్నీ తీసుకున్నావు గదా ? ఇంకా ఇల్లు తగల బెట్టడం కూడా ఎందుకు. అంత ఘోరం చెయ్యకు !'' అని బ్రతిమాలాడు.

''నా ఆచారాన్ని మంటగలపాలని చూస్తున్నావా ?'' అంటూ ముసుగువాడు, యతిరాజు మీద ఖస్సుమంటూ లేచి, మూలమూలల వున్న ఖాళీ అట్టపెట్టెలూ. కాగితాలూ, కొబ్బరిపీచూ, చెక్కలూ తెచ్చి, చావిట్లో కుప్పగా పోయసాగాడు. యతిరాజూ, విమలా ఏడుపు బిగబట్టు కున్నారు.

ముసుగువాడు మూటలు రెండూ తీసు కుని, తను పోగుచేసిన చెత్త మీద అగ్గిపుల్ల గీసి పడవేసి, బయటికి వెళ్ళాడు. వెంటనే యతిరాజు పెద్దగా కేకపెట్టాడు. ఆ మరు క్షణం, రామేశం రొప్పుతూ లోపలికి వచ్చాడు. అతడి చేతిలో దొంగ ఎత్తుకు పోయిన మూటలు రెండూ వున్నవి.

రామేశం మూటలను కింద పడవేసి, వంటగదిలోకి పోయి నీళ్ళబిందెలు తెచ్చి,



అప్పుడే రాజుకుంటున్న మంటను ఆర్పి, "దొంగ నన్ను చూసి, మూటలతో పెరటి గోడ దూకలేక, వాటిని వదిలి పారి పోయాడు," అని, యతిరాజు, విమలల కట్లు విప్పాడు.

విమల కోపంగా భర్త కేసి చూస్తూ, "ఈ గొడవంతా, మీ కారణంగానే జరి గింది. ఎప్పుడో పనికి వస్తవంటూ, అర్థ మైన చెత్తనూ ఇంట్లో జాగ్రత్తగా దాచారు. చూడండి, ఆఖరుకు అవి ఎలా పనికి వచ్చాయో! తమ్ముడు సమయానికి లేక పోతే, మీరు దాచిన చెత్తతోపాటు ఇల్లూ, మనం నిలువునా కాలిపోయేవాళ్ళం," అన్నది.

యతిరాజు ఎంతో పశ్చాత్తాపపడుతూ, "ఆ దొంగ, నా కళ్ళు తెరిపించాడు," అన్నాడు.

"జరిగిందేదో జరిగిపోయింది. ఇక ముందయినా, నీ అతిజాగ్రత్త కాస్త తగ్గించుకో, బావా!" అని రామేశం సలహా యిచ్చాడు.

ఆ మాట వింటూనే యతిరాజు, హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా, "అవును, జాగ్రత్త అంటే గుర్తుకొచ్చింది. రాత్రి పడుకోబోయేముందు గడియలన్నీ సరిగానే వేశాగదా! మరి, దొంగ ఇంట్లో కెలా వచ్చాడంటావు, విమలా?" అని భార్య నడిగాడు.

విమల వెంటనే, "పోయిన దీపావళి పండగ రోజున, కాకరపువ్వొత్తులు కాల్చాక, కడ్డీలు పారేయకుండా ఎందు కైనా పనికొస్తాయని చూరులో దాచారు. దొంగ ఆ కడ్డీలను తలుపు సందుల్లో దూర్చి, గడియ తీశాడు. చూడండి, ఇక్కడ కడ్డీలు తలుపు దగ్గిర పడి వున్నవి," అంటూ వాటిని తెచ్చి భర్తకు చూపింది.

ఇది జరిగాక, యతిరాజులో అతి జాగ్రత్త బాగా తగ్గిపోయింది. తమ్ముడి సాయంతో, భర్త చాదస్తానికి తగిన చికిత్స చేయగలిగినందుకు, విమల చాలా సంతో షించింది.





# సహజచిత్రం!

మాధవశర్మ పేరు ప్రఖ్యాతులు గల చిత్రకారుడు. ఆయన వేసిన చిత్రాలను జమీందార్లూ, పెద్ద వర్తకులూ చాలా ధర యిచ్చి కొంటూండేవాళ్ళు.

ఒకసారి ఆయన కుమ్ములాడుకుంటున్న రెండు ఎద్దులను చిత్రించాడు. దాన్ని చూసిన ఆయన అభిమానులు, మాధవశర్మను ఎంతగానో పొగిడారు.

ఆ పొగడ్తలకు మాధవశర్మ తన్మయుడైపోయాడు. ఆ రాత్రే ఆయన తన అభిమానులందరికీ గొప్ప విందు ఏర్పాటు చేశాడు. కుమ్ములాడే ఎద్దుల చిత్రాన్ని, ఒక పట్టువస్త్రం మీద అంటించి, దాన్ని ఒక గంధపుకర్రకు వేల్లాడదీశాడు.

ఆ అద్భుత చిత్రాన్ని నగరానికి తీసుకుపోయి, రాజుగారికి చూపాలన్న అభిప్రాయం కలిగింది, మాధవశర్మకు. ఆయన కొందరు అభిమానులను వెంటబెట్టుకుని నగరానికి బయలుదేరాడు. దారిలో వాళ్ళకు ఒక గ్రామం తగిలింది.

అభిమానుల్లో ఒకడు, మాధవశర్మతో, "శర్మగారూ! ఆ పోట్లాడే ఎద్దుల చిత్రాన్ని, యిక్కడి అమాయక పల్లె జనానికి చూపిద్దాం. వాళ్ళకు, మీరెంత గొప్ప చిత్రకారులో తెలుస్తుంది," అన్నాడు.

వెంటనే మాధవశర్మ, ఒక పెద్ద పెట్టెలో వున్న చిత్రాలలో నుంచి, ఎద్దుల పోట్లాట చిత్రాన్ని బయటికి తీసి, దాన్ని అక్కడ చేరిన గ్రామస్థులకు చూపుతూ, "నావద్ద చాలా చిత్రాలున్నవి. కాని, వాటిని అర్థం చేసుకోవడం, మీశక్తికి మించిన పని. అయితే, ఈ ఎద్దుల పోట్లాట చిత్రాన్ని, అతి సహజంగా, వాస్తవంగా చిత్రించాను. అందువల్ల, ఇది తప్పక మీకు ఆనందం కలిగిస్తుంది," అన్నాడు.

దేవప్రియ

గ్రామస్థులు చిత్రం కేసి చూసి, మౌనంగా వూరుకున్నారు. మాధవశర్మ వాళ్ళనేదో ప్రశ్నించబోయేంతలో, ఒక రైతు యువకుడు పొట్ట చెక్కలయేలా పెద్దగా నవ్వాడు. ఆ నవ్వు మాధవశర్మకు ఎక్కడలేని కోపం తెప్పించింది.

ఆయన రైతు యువకుడి కేసి గుడ్లురుముతూ, ''ఒరే, కుర్రవాడా! నీకు చిత్రకళ గురించి ఏమైనా తెలుసా? అలా విరగబడి నవ్వుతావెందుకు? ఈ ఎద్దుల పోట్లాట సహజంగా లేదా?'' అని ప్రశ్నించాడు.

''లేకేం? అ వుండడం మరీ మరీ అతి సహజంగా వున్నది!'' అన్నాడు రైతు యువకుడు వెటకారంగా నవ్వుతూ.

మాధవశర్మ అభిమానుల్లో ఒకడు కల్పించుకుని, ''ఆయనెవరో నీకు తెలుసా? మాధవశర్మగారనే గొప్ప చిత్రకారుడు. ఆయన చిత్రాలను రాజుగారే కాదు, జమీందార్లూ, ప్రముఖవర్తకులూ—ఎంత ధనమైనా ఇచ్చి కొంటూంటారు. అలాంటిది నువ్వు, ఈ చిత్రాన్ని చూసి వెటకారంగా నవ్వడం మర్యాద అనిపించుకోదు,'' అని మందలించబోయాడు.

అప్పుడు రైతు యువకుడు, ''అయ్యా, ఎద్దులు పోట్లాడుకోవడం, నేను చాలా సార్లు చూశాను. అవి మధ్య, మధ్య తలలు మోటిస్తూ, కొమ్ములతో పొడుచుకునేటప్పుడు, వాటి తోకలు చెర్నాకోలల్లాగా, గాలిలో గిరగిర తిరుగుతూంటవి. అంతేగాని, మీరు చిత్రంలో వేసినట్టు నడుం వెనక వేళ్ళాడుతూ వుండవు!'' అన్నాడు.

అప్పటివరకూ మౌనంగా వున్న గ్రామస్థులందరూ, ఒక్కసారిగా నవ్వసాగారు. మాధవశర్మ తన చేతిలో వున్న చిత్రాన్ని గంధపుకర్రకు గుండ్రంగా చుట్టి, పెట్టెలో పడవేశాడు.

తర్వాత ఆయనా, ఆయన అభిమానులూ మౌనంగా తలలు వంచుకుని గ్రామం విడిచిపోయారు.






## 9

[రాజకుమార్తె కాంతిమతి చిత్రసేనుడితో తన తండ్రి కపిలపురం కోటలో బంధించబడి వున్నాడని చెప్పింది. చిత్రసేనుడు సైన్యాలతో అక్కడికి వెళ్ళేసరికి, బురుజుల మీద సైనికులూ, కోట మీద రెండు భయంకర పక్షులూ కనిపించినై. ఆ భయంకర పక్షులను బెదరకొట్టేందుకు మండుతూన్న కాగడాలు చూపితే చాలు అన్నాడు, అమరపాలుడు. తరవాత—]

అమరపాలుడి మాటల్లో చిత్రసేనుడికి పూర్తి విశ్వాసం కలిగింది. అనాటి ఉదయం అతడు స్వయంగా భయంకర పక్షుల కొట్టాలకు నిప్పుపెట్టి, వాటిని సర్వనాశనం చేసి వున్నాడు. కాని, ఉగ్రాక్షుడికి మాత్రం ఆ పక్షులంటే వున్న బెదురు పోలేదు.

"మండుతూన్న కాగడాలు చూపితే, ఆ భయంకర పక్షులు మన మీద దాడి చేయకుండా పారిపోతయ్యా? ఇది నిజమా?" అన్నాడతడు ఎగిరి గంతేస్తూ.

"ఏయ్, కాగడాలూ!" అంటూ అమరపాలుడు కేకపెట్టాడు. ఆ వెంటనే నూనె ఓడుతున్న పెద్ద పెద్ద దివిటీలు చేతబట్టుకుని కొందరు సైనికులు ముందుకొచ్చారు.

అమరపాలుడు వాళ్ళను చిత్రసేనుడికి చూపుతూ, "మహారాజా! మీరు అజ్ఞ




యిచ్చారంటే, వాటిని వెలిగించి సైనికులు కోటగోడలకేసి నడుస్తారు. వాళ్ళతో కలిసి తతిమ్మా సైన్యం కోటను ముట్టడించ వచ్చు." అన్నాడు.

"హేయ్!" అంటూ ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లకేసి చప్పట్లు చరిచాడు.

"హాం, మహానాయకా, వచ్చాం, వచ్చాం!" అంటూ రాక్షసులు అన్ని వైపులనించీ ఉగ్రాక్షుణ్ణి చుట్టుముట్టారు.

"మీలో కొందరు మంచి జవ వున్న మానుల్ని పడగొట్టి, వాటితో కోట ద్వారాన్ని ఢీకొట్టి బద్దలు చేయండి. మిగతావాళ్ళు గునపాలు తీసుకుని కోటగోడల్ని పునాదులతో ఎత్తి, అవతల వేయండి," అంటూ ఉగ్రాక్షుడు తన సేవకులను ఆజ్ఞాపించి, చిత్రసేనుడితో, "మహారాజా! మనం ఒక్క ముఖద్వారాన్నుంచే కాక, అన్ని వైపుల నుంచీ కోటలో జొరబడటం మంచిది. కోటలోనూ, బురుజులమీదా వున్న కొద్దిమంది శత్రువులూ అందువల్ల ఒక్కటై మనను ఎదిరించలేరు. ఇక.... ఆ భయంకర పక్షులు మన మీద పడకుండా చూసే బాధ్యత అమరపాలుడిది!" అన్నాడు.

"నువ్వేమీ భయపడకు, ఉగ్రాక్షా! నీ రక్షణభారం నాది," అన్నాడు అమరపాలుడు తన అనుచరులకేసి కన్ను గీటుతూ.

"మానవాధముడివైన నువ్వా, ఈ మహారాక్షసుణ్ణి రక్షించేది?" అంటూ ఉగ్రాక్షుడు పళ్ళు కొరికి, రాతి గదను పైకెత్తబోయాడు.

"ఆగు, ఉగ్రాక్షా!" అన్నది రాజకుమారి కాంతిమతి ఆజ్ఞాపిస్తున్నదానిలా. "మీరూ మీరూ ఇక్కడ దెబ్బలాడి బలాబలాలు తేల్చుకునే లోపల, కోటలో బంధింపబడివున్న నా తండ్రిగారికి శత్రువుల నుంచి అపాయం కలగవొచ్చు. మహారాజా! నాకు సహాయం చేస్తానని మీరు మాట యిచ్చివున్నారు," అన్నది కాంతిమతి చిత్రసేనుడితో.

''అవును,'' అంటూ చిత్రసేనుడు తల వూపి, ఉగ్రాక్షుడితో, ''నువ్వు రాక్షస శ్రేష్ఠుడివే, అందులో సందేహం లేదు. నీ ప్రతాపం అమరపాలుడి మీద కాదు చూపించవలసింది, ఆ కోటలో వున్న శత్రువుల మీదా, దాని మీద గస్తీ తిరుగుతున్న భయంకర పక్షుల మీదా,'' అన్నాడు.

చిత్రసేనుడు ఇలా అనగానే ఉగ్రాక్షుడు ముఖంలో ఎక్కడ లేని తెగువా, పౌరుషం కనబరుస్తూ, ''ఒరే బంట్లూ, ఊఁ!'' అన్నాడు అడవి మార్మోగేళ్లా. ఆ వెంటనే రాక్షసులు మానుల్లాంటి చెట్ల మీద పడి, వాటిని కూకటివేళ్ళతో పెళ్ళగించి, కొమ్మలూ రెమ్మలూ చేతులతో దూసేసి, పెద్ద పెద్ద బోదెలను భుజాల మీద పెట్టుకొని, రంకెలు వేస్తూ కోట గోడలకేసి పరిగెత్తసాగారు. అదే సమయంలో వారికి వెనకగా, చిత్రసేనుడి సైనికులూ, భగభగ మండుతున్న కాగడాలతో కొందరు భటులూ పరిగెత్తారు.

కనుమూసి తెరిచేంతలో కోట ప్రాంతమంతా రణగొణ ధ్వనులతో దిమ్మెత్తిపోయింది. చిత్రసేనుడూ, అతడికి వెనకగా కాంతిమతీ సైనికులను ఉత్సాహపరుస్తూ తమ తమ అశ్వాలను దూకించారు. ఉగ్రాక్షుడు రాతి గదను గాలిలో వూపుతూ భీకరంగా బొబ్బరిస్తున్నాడు.




కోట గోడలు నూరు గజాలః దూరంలో వున్నవనగా, కోట బురుజుల మీది నుంచి ఒక్కుమ్మడిగా బాణాలు వచ్చి సైనికుల మీదా, రాక్షసుల మీదా పడినై. అదే సమయంలో చిత్రసేనుడి సైనికులలో బాణాలు వదల గలిగినవారు, మోకాళ్ళ మీద వంగి గురి చూసి, బురుజుల మీద వున్న శత్రువుల మీదికి బాణాలు వదిలారు. ఈ గందరగోళంలో కొందరు రాక్షసులు కోట ద్వారాలను సమీపించి, తమ భుజాల మీద వున్న చెట్టుబోదెలతో తలుపులను ఢీకొట్టసాగారు. మరికొందరు పెద్ద పెద్ద గునపాలతో కోటగోడలను పొడిచి బండరాళ్లను బదాబదలు చేయసాగారు.




ఉన్నట్టుండి ఆకాశం ఫెళ్ళుమని ఉరిమినట్టయింది. అందరూ నివ్వెరపోయి తేరుకునేలోపల సుడిగాలిలా భయంకర పక్షులు రెండూ మహావేగంతో సైనికుల కేసి రాసాగినై. అమరపాలుడు తన చేతిలో మండుతూన్న కాగడాను పైకెత్తి పక్షుల కేసి ఝళిపిస్తూ, "భయపడకండి! కాగడాలను వాటి మీదికి గురిచేయండి!" అంటూ హెచ్చరించాడు. మరుక్షణమే కాగడాలు మంటలు కక్కుతూ భయంకర పక్షులకేసి లేచినై.

భయంకర పక్షులు చెవులు చిల్లులు పడేలా వికృతంగా అరిచి, సైనికుల మీదికి దూకబోయేదల్లా తిరిగి ఆకాశంలోకి లేచినై. వాటి మీద వున్న పులిరాయుళ్ళు తమవద్ద వున్న శూలాలతో వాటి మెడల మీద పొడిచి, అవి సైనికుల మీద పడేలా చేసేందుకు ప్రయత్నించారు. కాని, కింద కాగడా మంటలను చూసిన పక్షులు తమ రౌతుల స్వాధీనం తప్పినై. అందులో ఒకటి రౌతు పొడిచిన శూలం పోటుకు రెచ్చిపోయి ఆకాశంలో తలకిందుగా పల్టీ కొట్టింది. పట్టుతప్పిన రౌతు కీచుమంటూ అరిచి, చేతిలో వున్న శూలాన్ని మరింత గట్టిగా గుప్పెట్లో బిగించి పల్టీలు కొడుతూ, అంత ఎత్తు నుంచి సైన్యం మధ్య పడి పోయాడు. సైన్యంలో విజయధ్వానాలు మిన్నుముట్టినై. చూస్తూండగానే భయంకర పక్షులు రెండూ ఆకాశంలో మాయమయినై.

భయంకర పక్షుల సహాయాన్ని నమ్ముకుని, అంతవరకూ గుండె దిటవుతో కోట బురుజుల మీద నిలబడిన నాగవర్మ సైనికులు, ఒక రౌతు చావటం, పక్షులు పలాయనం కావటం చూస్తూనే, భయకంపితులై కోట బురుజుల మీద నుంచి దూకి రాజప్రాసాదం కేసి పరిగెత్తసాగారు. పైనుంచి బాణవర్షం ఆగటంతో చిత్రసేనుడి సైనికులంతా కోట గోడల్ని చేరి క్షణాల మీద తలుపులను బద్దలుకొట్టారు. ఈ లోపల గునపాలతో గోడలు బద్దలు




కొడుతున్న రాక్షసులు గోడలో ఒకచోట పెద్ద కన్నం చేసి లోపలికి జొరబడ్డారు.

ఆ తరవాత పెద్ద పోరాటం లేకుండానే, రాజప్రాసాదం చిత్రసేనుడి హస్తగతం అయింది. మొండిగా ఎదిరించ పూనుకున్న కొద్దిమంది నాగవర్మ సైనికులను రాక్షసులు రాతి గదలతో దూది కింద ఏకేశారు.

కోటా, అందులోని పెద్ద రాజప్రాసాదం చిత్రసేనుడి వశమైనా, రాజు వీరసింహుడు ఎక్కడ బంధించబడి వున్నదీ తెలియ లేదు. అతణ్ణి ఒకవేళ శత్రువులు రహస్యంగా కోట బయటికి తీసుకుపొయ్యారా అన్న అనుమానం కూడా అతడికి కలిగింది. రాజకుమారి కాంతిమతి మాత్రం తన తండ్రి రాజప్రాసాదంలోని ఏ చీకటి కొట్టులోనో బంధించబడి వుంటాడనీ, సైనికులు జట్లు జట్లుగా వెళ్ళి అన్ని గదులూ, భూగృహాలూ వెదకటం మంచిదనీ చెప్పింది.

ఆ ప్రకారం సైనికులూ, రాక్షసులూ కలిసి రాజప్రాసాదమంతా గాలించ సాగారు. చీకటీ, నిశ్శబ్దం గూడు కట్టుకున్నట్టున్న భూగృహాల్లోని ఒకానొక గది నుంచి హఠాత్తుగా మూలుగు వినిపించింది. సైనికులు తమ చేతగల దివిటీల వెలుగులో అక్కడికి వెళ్ళి చూశారు. గది అంతా చీకటి మయంగా వుంది. లోపల ప్రవేశించేందుకు వీలు లేకుండా, బయట ఇనప చువ్వల ద్వారం తాళం వేసి వున్నది. చువ్వలలోకుండా దివిటీలను లోపలికి పోనిచ్చి చూసినప్పుడు ఆ గుడ్డి వెలుగులో ఎక్కడో దూరంగా గోడ నానుకుని ఒక మానవాకారం వున్నట్టు సూచనప్రాయంగా కనిపించింది.

"ఈయనే మహారాజు వీరసింహులు!" అంటూ ఒక సైనికుడు కేక వేశాడు. ఆ వెంటనే ప్రాసాదం అన్ని మూలల నుంచీ సైనికులూ, రాక్షసులూ గుంపులు గుంపులుగా అక్కడికి వచ్చారు. కాని గది లోపలికి ప్రవేశించేందుకు మాత్రం ఎవరి

వల్లా కాలేదు. ముందు గదికి వున్న ఇనప చువ్వల తలుపుల తాళాన్ని బద్దలు కొట్టాలి.

సైనికుల కోలాహలం వింటూనే చిత్రసేనుడూ, కాంతిమతీ అక్కడికి వచ్చారు. వాళ్ళకూ దివిటీల వెలుగులో గదిలో ఎవరో వ్యక్తి వున్నట్టు కనబడింది. చిన్నగా మూలుగు కూడా వినబడింది.

"మీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారు? ముందు తాళం బద్దలుకొట్టండి," అని ఆజ్ఞాపించాడు చిత్రసేనుడు.

సైనికులు గునపాలు తీసుకుని తాళం బద్దలుకొట్టేందుకు ప్రయత్నించారు. కాని పెద్ద కొబ్బరికాయ ప్రమాణంలో తుప్పుపట్టివున్న ఆ తాళం వాళ్ళ దెబ్బలకు ఖంగు ఖంగుమని ప్రతిధ్వనించింది తప్ప, ఔెనకలేదు. "తాళం తుప్పుపట్టి వున్నది. మహారాజా, చెవి వుంటే బావుణ్ణు!" అన్నాడొక సైనికుడు ఆయాసపడుతూ.

"ఆ తాళంచెవికోసం నువ్వు ద్రోహి నాగవర్మను ఆశ్రయిస్తావా?" అంటూ చిత్రసేనుడు ఆ సైనికుడి చేతి నుంచి గునపం తీసుకోబోయేంతలో, భూమి దద్దరిల్లే లాగా పెడబొబ్బలు పెడుతూ ఉగ్రాకుడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే కాంతిమతి, "ఉగ్రాకా! నా తండ్రిగారిని శత్రువులు ఈ చీకటి కొట్లో




బంధించి వెళ్లారు. నువ్వు తక్షణం తాళం పగలకొట్టి సహాయపడాలి," అన్నది.

"ఓం అదెంత పని," అంటూ ఉగ్రాకుడు తాళాన్ని గుప్పెటతో బిగించి పట్టి గట్టిగా గుంజాడు. అది వూడి రాలేదు. ఈసారి రెండు చేతులతోనూ పట్టి బలంగా లాగాడు. తలుపు చువ్వలు కిరకిరమన్నవి గాని, తాళం అలాగే వుండిపోయింది.

"ఈ నాగవర్మా వాడి భటులూ వింత మనుషుల్లా వున్నారు. తలుపులకంటే తాళం గట్టిది వేసినట్టున్నది!" అంటూ ఉగ్రాకుడు రెండు చేతులతోనూ ఇనప చువ్వల్ని పట్టుకుని బలంగా గుంజేసరికి, అవి మైనపువత్తుల్లా పక్కలకు వంగి

పోయినై. అక్కడ ఏర్పడ్డ ఖాళీలోంచి దివిటీలు పట్టుకున్న సైనికులు దూరి గది లోపలికి వెళ్ళారు. చూస్తూండగానే దివిటీల వెలుగులో గది గోడలో బిగించి వున్న ఇనప కమ్మీలకు గొలుసులతో కాళ్ళూ చేతులూ బంధించి వున్న వీరసింహుడు కనిపించాడు. అతడి నోటికి అడ్డంగా ఒక వస్త్రం చుట్టబడి వున్నది. అతడు బాధతో మూలుగుతున్నాడు.

తన తండ్రిని ఆ కష్టస్థితిలో చూస్తూనే కాంతిమతి నిలువెల్లా కంపించిపోయి, ''నాన్నా!'' అంటూ కేకపెట్టి అతడి దగ్గిరకు పరిగెత్తింది. చిత్రసేనుడు కూడా ఆమె వెంట గదిలో ప్రవేశించి, వీరసింహుడి నోటికి కట్టివున్న వస్త్రాన్ని విప్పేశాడు. ఈలోపల ఉగ్రాక్షుడు అతడి చేతులకూ, కాళ్ళకూ బిగించి వున్న గొలుసులను తెంచేశాడు.

''తల్లీ, నిన్ను తిరిగి ఈ జన్మలో చూస్తా ననుకోలేదు,'' అంటూ వీరసింహుడు నీరసంగా గోడకు చేరగిలబడ్డాడు. ఇంతలో ఒక సైనికుడు మహారాజు కూర్చునేందుకు ఒక ఆసనం తెచ్చాడు, మరొక సైనికుడు దాహం తీర్చుకునేందుడు నీటిపాత్ర అందించాడు.

వీరసింహుడు దాహం తీర్చుకుని సేదదేరి, ఆసనం మీద కూర్చుంటూ కాంతిమతితో, ''అమ్మా, ఆ ద్రోహి నాగవర్మ చచ్చాడా, లేక బందీగా చిక్కాడా?'' అని అడిగాడు.

కాంతిమతి జవాబు చెప్పబోయి తటపటాయించి చిత్రసేనుడికేసి చూసింది. చిత్రసేనుడు ముందుకు వచ్చి, ''మహారాజా! నా పేరు చిత్రసేనుడు. నన్ను గురించీ, నా రాజ్యం గురించీ వినే వుంటారు. ఈ రాక్షసుడి పేరు ఉగ్రాక్షుడు, నా సేవకుడు. నాగవర్మ నా తండ్రి గారిదైన ధవళగిరి రాజ్యం మీదికి దాడి వెళ్ళాడు. అతణ్ణి సాధ్యమైతే దారిలోనే అడ్డగించి హతమార్చేందుకు సైన్యంతో నా సేనానాయకుణ్ణి పంపాను,'' అని చెప్పాడు.

—(ఇంకావుంది)






# ప్రాణంవిలువ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కటికచీకటి, నక్కల ఊళలూ, గుడ్లగూబల అరుపులతో భయంకరంగా వున్న, ఈ శ్మశానంలో, వైఫల్యాలు పొందుతూ కూడా, పట్టు విడవని నీ వజ్రసంకల్పం మెచ్చదగిందే. కాని, ఒక వేళ నీ ప్రయత్నంలో విజయం సాధించినా, కేదారనాధుడి లాగా, వివేకం, లోకజ్ఞతా లేనివాడివైతే, ఫలితం నీకు దక్కకుండా పోతుంది. ఇందుకు ఉదాహరణగా, అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

చందనపురాన్నేలే, చంద్రసింహుడి కుమార్తె కుముదిని, ఒక ప్రమాదకరమైన

## బేతాళ కథలు



వింత వ్యాధికి గురి అయింది. రాజ వైద్యులు ఎంత ప్రయత్నించీ, ఆమె వ్యాధికి తగిన చికిత్స చేయలేకపోయారు. ఇతర రాజ్యాల నుంచి వచ్చిన వైద్యులకు కూడా, ఆ వ్యాధిని కుదర్చడం శక్యం కాలేదు.

ఇక తన కుమార్తె ఆరోగ్యం చక్క బడదని, చంద్రసింహుడు చెప్పలేనంతగా దిగులుపడసాగాడు. అలాంటి సమయంలో, ఆయనకు మంత్రులొక సలహా యిచ్చారు. అదేమంటే—కుముదినిని ఆరోగ్యవంతురాలినిగా చేసినవాడికి, ఆమె నిచ్చి వివాహం చెయ్యడమే కాక, అర్ధ రాజ్యం బహూకరించడం.

రాజు, ఆ ప్రకారమే తన దేశంలోనే కాక, ఇతర దేశాల్లో కూడా చాటింపు వేయించాడు. ఇది విన్న అనేకమంది వైద్యులు, చందనపురానికి వచ్చి, రాకుమార్తెను పరీక్షించి, వ్యాధి నిర్ధారణ చేయలేక కొందరూ; నిర్ధారణ చేయగలిగామన్న ధీమాతో మందులిచ్చి మరి కొందరూ విఫలులై తిరిగి పోయారు.

రాకుమారి రోజు, రోజుకూ చిక్కి శల్యమవసాగింది. చంద్రసింహుడు పుట్టెడు దిగులుతో మంచం పట్టే స్థితికి వచ్చాడు. ఇలాంటి సమయంలో, కేదారనాథుడనే యువవైద్యుడొకడు వచ్చి, రాకుమారి నాడీ, రోగలక్షణాలను జాగ్రత్తగా గమనించి, అదే రకం వ్యాధో గ్రహించాడు.

అతడు, రాజును దర్శించి, "ప్రభూ, రాకుమారిని నేను, తప్పక రోగ విముక్తురాలిని చేయగలను. అయితే, అందుకు అవసరం అయిన మూలిక ఒకటి సేకరించడానికి, నాగపర్వతం దగ్గిర వున్న అడవికి వెళ్ళాలి. వెళ్ళి రమ్మని సెలవా?" అన్నాడు.

చంద్రసేనుడిందుకు అనందంగా, తన అంగీకారం తెలిపాడు. కేదారనాథుడు అడవికి వెళ్ళి, మూలికకోసం అంతటా పట్టుదలగా వెదికి చూశాడు. ఒకచోట

అతడికి కావలసిన ఒకే ఒక మూలిక దొరికింది. రాకుమారి ప్రాణం నిలబెట్ట డానికి, ఆ మూలిక చాలు. ఒకే ఒకరికి చికిత్స చెయ్యడానికి, సరిపోతుందా మూలిక.

కేదారనాథుడు ఉత్సాహంగా, చందన పురానికి బయలుదేరి వచ్చాడు. అతడు రాజభవనాన్ని సమీపిస్తూండగా, పక్కనే వున్న ఉద్యానంలో పని చేస్తున్న వృద్ధు డైన తోటమాలి, ఒకసారి పెద్దగా మూలిగి కింద పడిపోవడం, అతడి కంటబడింది. తోటమాలి చుట్టూ కొందరు పరిచారకులు గుమిగూడారు.

కేదారనాథుడు, తోటమాలి నాడిని పరీక్షించి చూసి, మరికొన్ని నిమిషాల్లో, అతడి ప్రాణం పోనున్నదని గ్రహించాడు. చిత్రంగా, తోటమాలికి వచ్చిన వ్యాధి, రాకుమారికి వచ్చిన వ్యాధి లాంటిదే! అతడు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా, అడవి నుంచి తాను తెచ్చిన మూలికను అక్కడే నూరి, నీళ్ళల్లో కలిపి, తోటమాలి చేత తాగించాడు.

పావు గంటకాలం గడిచీ గడవ కుండానే, తోటమాలి కళ్ళు తెరిచి లేచి కూర్చుని, తన ప్రాణం రక్షించిన కేదార నాథుడికి చేతులెత్తి నమస్కరిస్తూ, "చిరంజీవిగా వర్ధిల్లు, నాయనా!" అన్నాడు.

ఈ జరిగిన సంగతి, క్షణాల మీద రాజభవనంలో తెలిసింది. రాకుమారి





కోసం తెచ్చిన మూలిక, ఇలా ఖర్చయి పోవడంతో, కేదారనాధుడు తిరిగి అడవికి వెళ్ళాలనుకున్నాడు. ఈసారి మూలిక దొరికేందుకు, రెండు వారాలకాలం పట్టినా పట్టవచ్చు. ఏమైనా, ఈ జరిగినది రాజు గారికి చెప్పడం అవసరం అనుకుని, అతడు చంద్రసింహుడి దగ్గిరకు పోయాడు.

చంద్రసింహుడు, కేదారనాధుడు చెప్పినది విని, ఉగ్రుడైపోయి, "నీకు చావుబతుకుల మధ్య వున్న, నా కుమార్తె ప్రాణం కన్న, పనికిమాలిన ఒక ముసలి వాడి ప్రాణం విలువైనదిగా కనిపించిందా? మరొక మూలిక దగ్గిర లేదని తెలిసీ, వాడి కోసం దాన్ని వినియోగించావు. ఈసారి అడవిలో, ఆ మూలిక దొరికేలోగా, నా కుమార్తె ప్రాణాలే కోల్పోవచ్చు. నీది క్షమించరాని నేరం!" అని, పక్కనున్న భటులను, "ఈ ద్రోహిని వెంటనే ఉరి తీయండి!" అని ఆజ్ఞాపించాడు.

భటులు, కేదారనాధుడి పెడరెక్కలు విరిచికట్టి, ఉరికంబం ఎక్కించారు. అతడు, రాజుతో, "ప్రభూ, తమరు తొందరపడక శాంతించండి! వారం రోజులలో, ఆ మూలికను తేగలను. ఈ లోపల రాకుమారి ప్రాణానికి వచ్చిన ప్రమాదం ఏమీ లేదు. ఇది, నా గురుదేవుల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను." అన్నాడు.

ఇంత చెప్పినా, చంద్రసింహుడి కోపం తగ్గలేదు. భటులు, కేదారనాధుడి మెడకు ఉచ్చు తగిలిస్తూండగా, ముసలి తోటమాలి అక్కడికి వచ్చి, రాజు పాదాలపైపడి, "మహాప్రభూ, మీరన్నట్టు, నా ప్రాణం విలువలేనిది, నిజమే! కాని, చిన్న వయసులో వున్న, ఈ వైద్యుడి ప్రాణం చాలా విలువైనది. నా కోసం గదా, ఈయన మూలికను వ్యర్థం చేశాడు! అందువల్ల, ఈయనను వదిలి, నన్ను ఉరి తీయించండి." అని అతి దీనంగా వేడుకున్నాడు.

ఇందుకు కేదారనాధుడు, అభ్యంతరం చెబుతూ, "ఈ వృద్ధుడి ప్రాణాన్ని, నేను కాపాడింది, దాన్ని ఉరికంబం మీద బలి పెట్టడానికి కాదు, ప్రభూ! తమరు సావధానంగా ఆలోచించి, మూలిక తెచ్చేందుకు, నాకు మరొక అవకాశం యివ్వండి. దానితో రాకుమారి తప్పక రోగవిముక్తురాలు కాగలదు. అలా కాదనుకుంటే, మీ ఇష్టప్రకారం నన్నే ఉరి తీయించండి!" అన్నాడు.



చంద్రసింహుడు, ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, మంత్రులు ఆయనకు, కేదారనాధుడికి మరొక అవకాశం యివ్వడం మేలని సలహా యిచ్చారు. రాజు అందుకు అంగీకరించాడు. వెంటనే భటులు, కేదారనాధుణ్ణి ఉరికంబం మీది నుంచి అవతలికి దించారు.

కేదారనాధుడు అడవికిపోయి, మూలికను సాధించి తెచ్చి, రాజుకు మాట యిచ్చిన ప్రకారం, రాకుమారికి చికిత్స ప్రారంభించాడు. ఎంతోకాలంగా, ఆమెను పట్టి పీడిస్తున్న వ్యాధి, రెండు రోజుల్లో తిరుగుముఖం పట్టింది. వారం గడిచేసరికి, ఆమె తన గదిలో లేచి తిరుగుతూ, సంతోషంగా అందరినీ చిరునవ్వుతో పలకరించసాగింది.

ఇది చూసి, చంద్రసింహుడు పరమానందం చెందాడు. కేదారనాధుడికి అర్ధ రాజ్యంతోపాటు, తన కుమార్తె నిచ్చి వైభవంగా వివాహం చేయాలని నిశ్చయించాడు. ఇందుకుగాను, ఆయన తన ప్రధానమంత్రిని, కేదారనాధుడి విడిది గృహానికి వెళ్ళి, అతణ్ణి సగౌరవంగా పల్లకీలో రాజభవనానికి తీసుకురావలసిందిగా ఆదేశించాడు.

అయితే, ప్రధానమంత్రి కొందరు బోయీలతో, పరిచారకులతో, విడిది గృహానికి వెళ్ళగా, అక్కడ కేదారనాధుడు కనిపించలేదు. అక్కడ ఉన్నవారిని విచారించగా, అతడు, సూర్యోదయానికి

ముందే, విడిది గృహాన్ని వదిలిపోయినట్టు తెలిసింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కేదారనాథుడు వైద్యవిద్యలో, తనకు తానే సాటి అన్నదానిలో వివాదం ఏమీ లేదు. ఎందరో ఘనవైద్యులు కుదర్చలేని, రాకుమారి వింతవ్యాధిని, అతడు ఒక్క మూలికతో నయం చేశాడు. అటువంటి వాడు గొప్ప మేధావీ, విజ్ఞానీ అయి వుండాలి. కాని, అతడు రాకుమారినీ, అర్ధరాజ్యాన్నీ కూడా తిరస్కరించడం, ఆశ్చర్యంగా లేదా? ఒకవేళ అతడు, అలాంటి సత్కారానికి అనర్హుణ్ణను కున్నాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కేదారనాథుడు స్వార్థం కొద్దీ, రాకుమారికి వైద్యం చేయలేదనేది స్పష్టంగా తెలుస్తూనే వున్నది. అతడలాంటి స్వార్థపరుడైతే, ఎంతో శ్రమించి తెచ్చిన మూలికను, వృద్ధ తోటమాలి ప్రాణరక్షణకు ఉపయోగించే వాడు కాదు. వైద్యుడుగా అతడికి తెలిసింది ముఖ్యంగా ప్రాణంవిలువ. అతడే పాటి విజ్ఞాని, మేధావి అనే ప్రశ్నలు ప్రస్తుత సందర్భానికి సంబంధించినవి కావు. రాజు చంద్రసింహుడు మితిమీరిన స్వార్థం తప్ప, ప్రాణంవిలువ తెలిసిన వాడు కాదు. అందువల్లనే, తోటమాలి ప్రాణాన్ని చిల్లిగవ్వగా భావించడమేగాక, అతణ్ణి ఉరికంబం కూడా ఎక్కించాడు. అటువంటి వాడికి అల్లుడైతే, తను కష్టించి నేర్చిన వైద్యవృత్తికి తిలోదకాలివ్వవలసి వస్తుంది. వైద్యశాస్త్రమే కాక, అన్ని ధర్మ శాస్త్రాలూ, ప్రాణరక్షణను ఎంతో ప్రధానంగా పేర్కొంటూన్నవి. అందువల్లనే, కేదారనాథుడు, తను వచ్చిన పని విజయవంతం కాగానే, రాజుకు వీడ్కోలు కూడా చెప్పకుండా వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# పిల్లమేఘం

త్రిగర్త దేశంలో అందరూ కర్షకులే. ఆ దేశం ఎల్లప్పుడూ పాడిపంటలతో సమృద్ధిగా ఉండేది. అక్కడి ప్రజల సుఖసంతోషాలు పూర్తిగా వానదేవుడి పైనా, అతడు పంపే మేఘాల పైనా ఆధారపడి ఉండేవి.

అయితే త్రిగర్త ప్రజలు ఎందరెందరు దేవుళ్ళనో ఆరాధించేవాళ్ళు. కాని, వాన దేవుణ్ణీ, మేఘాలనూ ఆరాధించేవారు కారు. కనీసం మేఘాలకు చెయ్యెత్తి దణ్ణం పెట్టి తమ కృతజ్ఞత తెలుపుకునే వారైనా కారు. ఇది చూసి మేఘాలకు కోపం వచ్చేసింది.

మేఘాలన్నీ దూర ప్రాంతాన సమావేశమై, త్రిగర్తదేశం మీద ఒక్క చినుకు కూడా రాల్చకూడదని ఏకగ్రీవంగా తీర్మానించుకున్నాయి.

దాని ఫలితంగా త్రిగర్తదేశానికి ఆ యేడు వర్షాకాలం వచ్చింది కాని వర్షాలు రాలేదు. అక్కడి ప్రజలు కళ్ళు చిల్లులు పడేటట్టు ఆకాశంకేసి తెగ చూశారు. ఎక్కడా ఒక్క చిన్న మబ్బు తునక కూడా లేదు. ప్రజల ఆందోళన అంతా ఇంతా కాదు. వాళ్ళు పడే ఆవేదన చూసి మేఘాలు మహా సంతోషించాయి.

కాని తలవని తలంపుగా ఆ మేఘాల సంతోషాని కొక పెద్ద దెబ్బ తగిలింది. ఒక పిల్లమేఘం ఇతర మేఘాలతో చెప్పకుండా చెయ్యకుండా త్రిగర్తదేశానికి వెళ్ళి అక్కడ ఒక జల్లు కురిసి వచ్చింది.

"అమ్మయ్య, వర్షాలు ఆరంభమయాయి," అనుకుని త్రిగర్త ప్రజలు తాము దాచి ఉంచిన విత్తనాలు చల్లి, నారుమళ్ళు వేసుకున్నారు.

ఈ లోపల పెద్దమేఘాలు పిల్లమేఘాన్ని నానా చివాట్లూ పెట్టాయి: "ఏమిటి నీ ఉద్దేశం? మేమంతా కలిసి త్రిగర్తులకు

వాన బొట్టు లేకుండా చేసి ఏడిపించాలని తీర్మానించుకుంటే, ఎవరికీ చెప్పకుండా పెట్టకుండా వెళ్ళి వానకురిసి వస్తావా? నీ కేమన్నా బుద్ధి వుందా?''

''మీ తెలివి తెల్లారినట్టే ఉంది. నే నొక్క చిన్న జల్లుతో, ఆ త్రిగర్తులు దాచుకున్న విత్తనాల గింజలు కూడా వాళ్ళకు దక్కకుండా నేలపాలు చేయించి వచ్చాను. ఆ సంగతి మీరు గ్రహించటం లేదు,'' అన్నది పిల్లమేఘం పెద్ద మేఘాలతో.

త్రిగర్త దేశప్రజల పరిస్థితి ఇప్పుడెలా ఉన్నదీ చూడటానికి పెద్ద మేఘాలు కదిలి వచ్చాయి. ఈలోపుగా జనం తహ తహ లాడిపోతున్నారు. ఒక్క జల్లు పడగానే వానలు ఆరంభమయాయిగదా అనుకుని, వాళ్ళు దాచుకున్న విత్తనాలను కాస్తా మళ్ళలో చల్లేశారు. ఆ తరవాత మళ్ళీ చినుకు లేదు. వాళ్ళు అదేపనిగా ఆకాశానికేసి చూస్తూ, వానదేవుడికీ మేఘాలకూ దణ్ణాలు పెట్టుకుంటూ, ఆక్రోశిస్తున్నారు.

వాళ్ళను చూసేసరికి పెద్ద మేఘాలకు ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది. అవి పిల్లమేఘాన్ని, ''పెద్దవాళ్ళతో చెప్పకుండా ఇలాటి అల్లరి చిల్లర పనులెన్నడూ చెయ్యకు,'' అని మందలించి, త్రిగర్త దేశంపైన కుంభపోతగా వర్షించి, తమ దారిన తాము వెళ్ళిపోయాయి.

తమ ప్రార్థనలు విని, మొరలాలకించి వర్షం ప్రసాదించినందుకు త్రిగర్త ప్రజలు అది మొదలు వానదేవుడికి కొలుపులు చేస్తూ వచ్చారు. అక్కడ ఏనాడూ అనావృష్టి లేదు. అది సుక్షేత్రమైన ప్రదేశం.

దీనికంతకూ మూలకారణం పిల్ల మేఘమే నన్న సంగతి పెద్దమేఘాలకు తెలీదు. అది ఆకతాయితనంగా చేసిన పని చివరకు త్రిగర్త ప్రజల మంచికే దారితీసింది. పెద్ద మేఘాలచేత తల వాచేటట్టు చివాట్లు తిన్న కారణంగా పిల్లమేఘానికి కూడా తాను ఘనకార్యం చేసిన సంగతి తెలీదు పాపం.






మనదేశపు అద్భుతాలు :

# చిత్తోడ్‌ఘర్

రాజస్థాన్‌లో అయిదు వందల అడుగుల ఎత్తు కొండ మీద, ఏడువందల ఎకరాల విస్తీర్ణంలో విస్తరించి ఉన్న చిత్తోడ్ దుర్గం చాలా ప్రసిద్ధమైనది. ఎన్నో రాజకుటుంబాలకు నివాసంగా వెలసిన ఈ కోటలో పురాణపురుషుడయిన భీముడు కొంత కాలం నివసించినట్టు చెబుతారు.

చారిత్రకంగా చూసినట్టయితే, చిత్రాంగదు డనే మౌర్య రాజు ఇక్కడ ప్రప్రథమంగా తన రాజధానిని నిర్మించాడు. ఆ కొండకు చిత్రకూటమని పేరు పెట్టాడు. అదే కాలక్రమేణా చిత్తోడ్ అయింది. అయితే, ఆ రాజు నిర్మింపజేసిన కోటకాలగర్భంలో కలిసిపోయింది.





ఎనిమిదవ శతాబ్దంలో, ఇది మేవారును పరిపాలించిన రావల్ వంశీయులకు రాజధాని అయింది. పదమూడవ శతాబ్దంలో రాణారతన్‌సింగు మేవారును పరిపాలించాడు. ఆయన భార్య రాణి పద్మిని జగదేకసుందరిగా ప్రసిద్ధి గాంచింది. ఆమెను చేబట్టాలని ఢిల్లీని పరిపాలించిన అల్లా ఉద్దీన్ ఖిల్జీ చిత్తోడ్ దుర్గాన్ని ముట్టడించాడు.



ఖిల్జీ ఎంత ప్రయత్నించినప్పటికీ చిత్తోడ్ కోటను పట్టుకోలేకపోయాడు. అతడు కొండ పాదతలంలో మకాం చేసి, రాణి పద్మినీ దేవి ప్రతిబింబాన్ని అద్దంలో చూడడానికి రాణారతన్‌సింగు అనుమతిని ప్రార్థించాడు. రతన్‌సింగు అందుకు అంగీకరించి, ఖిల్జీకి వీడ్కోలు చెప్పడానికి కొండ దిగి వచ్చాడు. అదే అదనుగా, రాళ్ళమాటున, పొదలచాటున దాగి ఉన్న సుల్తాన్ సైనికులు రతన్‌సింగును పట్టి బంధించారు.

రాణిపద్మిని తన వద్దకు రావాలనీ, అలా రాని పక్షంలో తాను రతన్‌సింగును హతమారుస్తాననీ, ఖిల్జీ, రాణిపద్మినీకి కబురు పంపాడు. తన ఏడువందల మంది చెలికత్తెలతో తాను, సుల్తాను నమక్షానికి వస్తున్నట్టు రాణిపద్మిని అతనికి ప్రత్యుత్తరం పంపింది. రాణి రాక కోసం పరమానందంతో ఖిల్జీ ఎదురు చూడసాగాడు. దుర్గం నుంచి మేనాలు బయలుదేరాయి.






ఖిల్జీ మకాం చేసిన స్థలం చేరగానే, మేనాలనుంచి 1400 మంది రాజపుత్ర సైనికులు, కత్తులు దూస్తూ కిందికి దూకారు. మేనాలను మోసుకొచ్చిన వాళ్ళు కూడా సైనికులే. మరుక్షణమే ఇరు సేనల మధ్య భీకరమైన యుద్ధం ప్రారంభమయింది. ఖిల్జీ సైనికులు చాలామంది చచ్చారు. రాణారతన్‌సింగు బంధవిముక్తుడయ్యాడు. ఖిల్జీ ప్రాణాలతో తప్పించుకుని పారిపోయాడు.

అవమానభారంతో ఢిల్లీ చేరిన ఖిల్జీ, ఎలాగైనా చిత్తోడ్‌ను పట్టుకోవాలన్న పట్టుదలతో, పెద్ద సైన్యాన్ని సమకూర్చుకుని, ఒక సంవత్సరం తరవాత హఠాత్తుగా దుర్గాన్ని ముట్టడించాడు. రాజపుత్ర సైనికులు అసమాన ధైర్యసాహసాలతో పోరాడి వీరమరణం చెందారు. అదే సమయంలో కోటలోని రాణి పద్మిని, ఇతర రాజపుత్ర వనితలు, శత్రువులకు పట్టుబడకుండా, అగ్నిరగిలించి, అందులోకి దూకి ప్రాణత్యాగం చేశారు!






అద్భుతమైన కీర్తనలు రచించిన సుప్రసిద్ధ కృష్ణ భక్తురాలు మీరాబాయి చిత్తోడ్‌ను పరిపాలించిన భోజరాజును వివాహమాడింది. రాజు ఆమెకు చక్కటి కృష్ణ మందిరాన్ని నిర్మించి ఇచ్చాడు. కృష్ణ విగ్రహం ముందు కూర్చుని, మీరాబాయి తన్మయత్వం చెందుతూ తన కీర్తనలను ఆలాపించేది!

పసిప్రాయంలో ఉన్న యువరాజును చంపడానికి, ఒకప్పుడు ఒక హంతకుడు ఈ కోటలోకి ప్రవేశించాడు. అప్పుడు అక్కడి పన్నా అనే చెలికత్తె, తన కన్న బిడ్డను యువరాజని చూపించి, అసలైన యువరాజును రహస్యంగా సురక్షిత ప్రదేశానికి చేర్చి, కాపాడింది!





ప్రస్తుతం చిత్తోడ్ దుర్గం శిథిలావస్థలో ఉన్నది. అయినా ఇంకా అక్కడ అద్భుతమైన కట్టడాలు వెలుగొందుతున్నాయి. వాటిలో కెల్లా అత్యంత అద్భుతమైనది, 1448వ సంవత్సరం మహాకుంభరాణా నిర్మించిన జయ స్తంభం. గుజరాతును పరిపాలించిన సుల్తాన్ కుతుబుద్దీన్‌షా మీద మహా కుంభరాణా సాధించిన విజయానికి చిహ్నంగా ఈ స్తంభం నిర్మించబడింది.

ఇక్కడి బ్రహ్మాండమైన మహాకుంభ రాణా భవనం, ఎంతో జాగ్రత్తగా, బలమైన రక్షణ ఏర్పాట్లతో నిర్మించబడింది. కోటలోపలి నుంచి, సుదూరప్రాంతాలకు తీసుకుపోయే సొరంగాలు, రహస్య భూఘర్భమార్గాలు ఇందులో ఉన్నాయి. ఈ భవనం భూగర్భమంటపంలోనే రాణిపద్మిని ప్రాణత్యాగం చేసింది.





ఇక్కడి పురాతన మందిరాలలో ప్రధానమైనది కాళీమాత ఆలయం. ఈ స్థల అధిదేవతగా, కాళీమాతను పేర్కొంటారు. తొలి రోజులలో ఈ గుడి సూర్య మందిరంగా ఉండి ఉండవచ్చునని మరి కొందరు భావిస్తున్నారు.



# మట్టి పట్టితే బంగారం

ఒక రైతుకు ఒక కొడుకు ఉండేవాడు. ఆ కుర్రవాడు చిన్నవాడుగా ఉండగానే తల్లి పోయింది. కొంత కాలానికి రైతు కూడా జబ్బుపడి, తన అవసాన కాలం సమీపించిందని గ్రహించి, కొడుకును పిలిచి, "నాయనా, నేను పేదవాణ్ణి కావటాన, నీకు ఆస్తిపాస్తులేమీ ఇవ్వలేను. కాని నువు మట్టి పట్టుకున్నా అది బంగారం కావాలని మనసార ఆశీర్వదిస్తున్నాను," అన్నాడు.

తండ్రి పోయాక కొడుకు తన తల్లిదండ్రులను భక్తితో స్మరించి, కష్టపడి పని చేయసాగాడు. అతని కృషి ఫలించి త్వరలోనే అతనికి ఒక సొంత ద్రాక్షతోట ఏర్పడింది. ఆ చుట్టుపట్ల వున్న అన్ని తోటల కన్న అతని ద్రాక్షతోట ఎక్కువ ఫలవంత మవుతూ వచ్చింది. కొంత కాలం గడిచాక అతను మరి కొన్ని పళ్ళ తోటలు కొన్నాడు; జాలారి పడవలు కొన్నాడు; నూనె గానుగలు పెట్టాడు. నూనె మీదా, చేపల వ్యాపారంలోనూ విపరీతంగా లాభాలు వచ్చాయి. త్వరలోనే అతను నగరంలోని పెద్ద ధనికులలో ఒకడయాడు. అతను ఏది తలపెట్టినా కలిసి వచ్చింది.. అతను భోగ భాగ్యాలతో తులతూగుతూ, రాజభవనం లాంటి ఇంట్లో కాపరం చేస్తూ, ఒక సంపన్నుడి కుమార్తెను పెళ్ళాడి, ఏ లోటూ లేకుండా హాయిగా జీవిస్తున్నాడు.

కాని ఒకనాడు అతనికి తన అదృష్టం గురించి జంకు పుట్టింది. అతను తన ఆప్తమిత్రుడితో, "మిత్రమా, నా శక్తి సామర్థ్యాలకు మించిన అదృష్టం నాకు పట్టుకున్నది. అందుచేత నాకేమో భయంగా ఉన్నది. తేలికగా వచ్చిన లక్ష్మి తేలికగానే పోవచ్చు. పెద్దమ్మకు నాపై

గ్రీకు జానపద కథ



ఆగ్రహం రావచ్చు. ఆమె సంతృప్తి కోసం కొంత నష్టపోయే పని ఏదన్నా చేద్దామని ఉన్నది. నమ్మకంగా నష్టం వచ్చే మార్గం ఏదన్నా వున్నదేమో కాస్త ఆలోచించి చెప్పు." అన్నాడు.

అతని మిత్రుడు కొంచెం ఆలోచించి, "ఖర్జూరాలు ఎక్కడి నుంచి వస్తాయి?" అని అడిగాడు.

"కైరో నుంచేగద!" అని జవాబిచ్చాడు మనవాడు.

"ఇకనేం? ఇక్కడ దొరికినంత ఖర్జూరం వీలయినంత హెచ్చు ధరకు కొను. దాన్ని ఒంటెల మీద కైరోనగరానికి తీసుకుపోయి, అక్కడ పలికే తక్కువ ధరకు పోటీపడి అమ్ము. నీకు నమ్మకంగా నష్టం వస్తుంది," అన్నాడు మిత్రుడు.

ఈ సలహా మనవాడికి నచ్చింది. అతను మర్నాడు నగరంలోని వర్తకుల వద్ద ఎంత ఖర్జూరం ఉంటే అంతా కొనేశాడు. ధర కూడా చాలా హెచ్చుగానే ఉన్నది. తరవాత అతను కొన్ని ఒంటెలను కిరాయికి తీసుకుని, ఖర్జూరాల గంపలు వాటి మీది కెక్కించి, కైరోకు ప్రయాణమై వెళ్ళాడు.

చాలా రోజులు ఎడారి మీదుగా ప్రయాణం చేసి అతను పిరమిడ్లు ఉండే ప్రాంతానికి చేరుకుని, వాటిని చూసి ఆశ్చర్యపోతూ నిలబడి ఉన్నాడు. అదే సమయంలో, ఒక తెల్ల గుర్రం ఎక్కి ఈజిప్టు దేశపు రాజు అటుగా వచ్చాడు. ఆయన వెంట ఆయన పరివారమూ, అనేక మంది సైనికులూ ఉన్నారు. సైనికులందరి చేతుల్లోనూ జల్లెడ లున్నాయి!

మనవాడు రాజుకు నమస్కారం చేసి, "ప్రభూ, ఈ సైనికు లందరూ జల్లెడలతో వచ్చారు, ఏమిటి విశేషం?" అని మర్యాదగా అడిగాడు.

దానికి రాజు, "ఏం చెప్పమన్నావు? ఈ రోజు ఉదయం నేను ఇటువైపుగా గుర్రం మీద షికారు వచ్చాను. నా పెళ్ళి ఉంగరం ఎక్కడో పడిపోయింది. అది

నాకు ప్రాణప్రదమైన ఉంగరం. అది దొరికినదాకా ఈ ప్రాంతాన గల ఇసక యావత్తూ జల్లెడ పట్టించ దలిచాను." అన్నాడు.

కొంతసేపు తరవాత ఆయన మనవాణ్ణి, "కైరోకు ఏం పని మీద పోతున్నావు?" అని అడిగాడు.

"కైరోలో ఖర్జూరాలు అమ్ముదామని బయలుదేరాను," అన్నాడు మనవాడు, ఒంటెల మీద ఉన్న ఖర్జూరాల తట్టలను రాజుకు చూపిస్తూ.

రాజు నిర్ఘాంతపోయి, "కైరోలో ఖర్జూరాలా అమ్ముతావు? దగ్గిరలో ఉన్న ఈ ఖర్జూరచెట్ల కేసి ఒకసారి చూడు. ఎలా విరగకాశాయో! ఒక్క చెట్టు కాయలు కొయ్యడానికి ఒక్క రోజు చాలదు. నీవు నీ సరుకు తీసుకుపోతే బుట్టకు ఒక రాగి నాణెం పైన రాదు. నువు చాలా నష్టపోతావు," అన్నాడు.

ఈ మాటలకు రాజు వెంట ఉన్న వారంతా గొల్లున నవ్వారు.

మనవాడు తాను నష్టపోవటానికే సిద్ధంగా ఉన్నానని చెప్పి, "మీరు అంటున్నారు గాని, నాకు నష్టం రాదేమో నన్న భయం ఉండనే ఉన్నది. మా నాన్న చనిపోతూ చేసిన దీవన ఫలితంగా, నేనిలా మట్టి పట్టుకుంటే అది బంగారమవుతున్నది," అంటూ వంగి గుప్పెడు ఇసుక తీశాడు.

అతను చెయ్యి విప్పేసరికి ఇసుక జారిపోయి అతని అరిచేతిలో బంగారు ఉంగరం మిగిలింది.

"అదే నేను పోగొట్టుకున్న ఉంగరం!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

ఆయన మనవాడి అదృష్ట రేఖను మెచ్చుకుని, తన ఉంగరం తేలికగా తనకు దొరికేటట్టు చేసినందుకుగాను అతనికి ఎన్నో విలువగల కానుక లిచ్చి, తిప్పి పంపేశాడు.

నష్టం కోసం వెళ్ళినవాడు కాస్తా మరింత లాభం చేసుకుని, మనవాడు తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.



# పిసినారి ఆటకట్టు

ఆ ఊళ్ళో గోపయ్య, మహాపిసినారిగా పేరు పొందాడు. బాగా డబ్బున్నవాడయినా, అతను తన కొడుకు రామయ్యకు కూడా పిసినారిచేష్టలు నేర్పడం చూసి, అందరూ బాధపడేవాళ్ళు.

ఒకసారి గోపయ్య, రామయ్యకు పండగబట్టలు కుట్టే ఏర్పాటు చేశాడు. అయితే, దర్జీ ధర్మయ్యకు, బట్టలు కుట్టిన కూలీ ఎగవేయాలని పథకం వేశాడు. అందుకు ధర్మయ్యతో ఎలా మాట్లాడాలో, కొడుక్కు నేర్పాడు.

అయితే, తీరా పండగనాడు గోపయ్య, కొడుకును పాతబట్టల్లో చూసి ఆశ్చర్యపోయి, "ఏరా, కుట్టిన కొత్తబట్టలు తెచ్చుకోలేదా?" అని ప్రశ్నించాడు.

"దర్జీ ధర్మయ్య, తన కూలి డబ్బులు యివ్వందే, కుట్టిన బట్టలు యివ్వనన్నాడు," అని చెప్పాడు రామయ్య.

"చిన్న పిల్లవాడు డబ్బులు తెస్తూ, దారిలో పోగొట్టుకుంటాడనే భయంతో, నాన్న కూలీ డబ్బు లివ్వలేదని, ధర్మయ్యకు చెప్పలేదా?" అని అడిగాడు గోపయ్య కోపంగా.

"ఆ మాటే చెప్పాను, నాన్నా! నువ్వు దారిలో డబ్బులు పోగొట్టుకోకుండా తెగలిగినంత పెద్దవాడి వయ్యేవరకూ, ఆగుతానన్నాడు, ధర్మయ్య," అని చెప్పాడు రామయ్య.

ధర్మయ్య తన ఆట కట్టించాడని తెలుసుకున్న గోపయ్య, కొత్త దుస్తులు తెచ్చుకునేందుకు, రామయ్యకు డబ్బు లిచ్చాడు.

—ఎం. డి. సౌజన్య






రావణుడు వరుణలోకం నుంచి బయలుదేరి లంకకు తిరిగి వస్తూ, దారిలో కనిపించిన అందగత్తెలైన కన్యలను వేల సంఖ్యలో చెరపట్టి తెచ్చి పుష్పకంలో ఎక్కించుకున్నాడు. వాళ్ళందరూ గొల్లున ఏడుస్తూ, రావణుణ్ణి రకరకాలుగా శాపనార్థాలు పెట్టారు.

అతను ఇంటికి చేరుతూండగానే అతని చెల్లెలు శూర్పణఖ ఎదురువచ్చి, పెద్ద పెట్టున ఏడుస్తూ, "ఏం చెప్పేది? నా భర్తను మిగిలిన కాలకేయులతోబాటు చంపి నన్ను విధవను చేసేశావు. బాపమరిది అన్న కనీస జ్ఞానం కూడా నీకు లేకపోయింది," అని ఎంతగానో నిందించింది.

"అమ్మాయీ, జరిగినదానికి ఏడ్చి లాభమేమిటి? యుద్ధోన్మాదిగా ఉన్న సమయంలో, వీడు నా వాడన్న జ్ఞానం కూడా నాకు లేకపోయింది. ఇక ముందు నువు మన ఖరుడి వెంట ఉండు. వాడు నీకే కొరతా లేకుండా చూస్తాడు. పద్నాలుగు వేల రాక్షసులకు వాణ్ణి నాయకుడుగా చేసి, దూషణుణ్ణి కూడా ఖరుడికి తోడిచ్చి దండకారణ్యాన్ని, రక్షించటానికి పంపిస్తున్నాను. వాళ్ళంతా నీకు విధేయులై ఉండి, నువుకోరినట్టు చేస్తారు," అన్నాడు రావణుడు.

ఆ ప్రకారమే శూర్పణఖ ఖరదూషణుల వెంట దండకారణ్యానికి వెళ్ళి అక్కడ సుఖంగా జీవిస్తూ వచ్చింది.

6. మేఘనాద విజయం



తరవాత రావణుడు నికుంభిలవనానికి వెళ్ళి, అక్కడ యజ్ఞం చేస్తున్న తన కుమారుణ్ణి, మేఘనాదుణ్ణి చూసి, అమితానందంతో కౌగలించుకుని, "నాయనా, ఇక్కడ ఏం చేస్తున్నావు నువు ?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానం శుక్రాచార్యుడు చెప్పాడు: "నీ కొడుకు ఏడు యజ్ఞాలు తలపెట్టాడు. అగ్నిష్టోమమూ, అశ్వమేధమూ, రాజసూయమూ, గోమేధమూ వైష్ణవమూ అన్నవి గాక, అత్యంత దుర్లభమైన మహేశ్వరయజ్ఞం చేసి శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని కామగమనం గల రథాన్నీ, అంతటా చీకటి ఆవరింప జేయగల మాయనూ, శక్తివంతమైన ధనుర్బాణాలనూ వరంగా పొందాడు. ఇప్పుడు చేస్తున్నదే ఆఖరు యజ్ఞం."

శుక్రాచార్యుడు చెప్పిన ఈ మాటలతో ఏమాత్రమూ తృప్తిపడక రావణుడు, "మీరు చేసిన పని ఏమీ బాగా లేదు. మన శత్రువులైన ఇంద్రాదులను అర్చించటానికి ఎంతో ద్రవ్యం నష్టపరిచారు. ఇంతవరకు నువు సంపాదించిన పుణ్యం చాలు." అని మేఘనాదుణ్ణి తన వెంట తీసుకుపోయాడు

అప్పుడు విభీషణుడు రావణుడి కొక దుర్వార్త చెప్పాడు. రావణుడికి చెల్లెలి వరస అయిన కుంభీనస అనే పిల్ల రావణుడి ఇంట పెరుగుతున్నది. రావణుడి తల్లికి పెదనాన్న అయిన మాల్యవంతుడి కూతురి కూతురు కుంభీనస. మధు వనే రాక్షసుడు వచ్చి, భవనంలో ఎవరూ లేని సమయంలో దాన్ని ఎత్తుకుపోయాడు. ఆ సమయంలో రావణుడు దిగ్విజయం వెళ్లి ఉన్నాడు. కుంభకర్ణుడు అమితమైన మత్తుతో నిద్రపోతున్నాడు. విభీషణుడు నీటిలో మునిగి తపస్సు చేసుకుంటున్నాడు.

తాను ఎందరు కన్యలను అపహరించి తెచ్చినా, తన చెల్లెలిని ఎవరో అపహరించారనే సరికి రావణుడు మండి పడ్డాడు.

అతను కుంభకర్ణుణ్ణి నిద్రలేపించి, రాక్షస వీరులనూ, సైనికులనూ యుద్ధానికి సిద్ధం చేయించి, మధువు వుండే మధుపురం మీదికి వెళ్ళాడు.



తన భర్తను చంపటానికి తన అన్న అయిన రావణుడు పెద్ద సేనతో వస్తున్నాడని తెలిసి, కుంభీనస చెప్పరాని భయంతో ఏడుస్తూ అతనికి ఎదురు వచ్చి, "అన్నా, నీ బావమరిదిని చంపి నాకు వైధవ్యం కలిగించకు," అని బతిమాలింది.

రావణుడు కుంభీనస దైన్యానికి కరిగి, "నీ భర్తను చంపనులే. అతను ఎక్కడ ఉన్నాడో చూపించు. నేను దేవతలను జయించటానికి స్వర్గానికి వెళుతున్నాను. అతన్ని కూడా వెంట తీసుకుపోతాను," అని చెప్పాడు.

కుంభీనస అమితానందంతో తన భర్త అయిన మధువు వద్దకు వెళ్ళి, "మా అన్న నిన్ను దేవతలతో యుద్ధం చెయ్యటానికి పిలుస్తున్నాడు, వెళ్ళు. అలాటి వాడి స్నేహం మనకు చాలా మంచిది," అని చెప్పింది.

మధువు రావణుడి వద్దకు వచ్చి, అతన్ని అర్ఘ్య పాద్యాలతో సత్కరించి, ఎన్నో మర్యాదలు చేశాడు.

రావణుడు ఒక్క రాత్రి తన బావమరిది ఆతిథ్యం స్వీకరించి, మర్నాడు బయలుదేరి వైశ్రవణుడుండే కైలాసం వద్దకు చేరుకున్నాడు. అప్పటికి సాయంకాలం కావటం చేత రావణుడి సేన అక్కడే విడిసింది.

ఆ రాత్రి చంద్రుడు చక్కటి వెన్నెల కాస్తున్నాడు. చల్లని మందమారుతం మెల్లమెల్లగా వీస్తున్నది. చెట్ల మధ్య కిన్నరులు బృందగానాలు చేస్తున్నారు. కుబేరుడి మందిరంలో అప్సరసలు పాడే పాటలు మధురంగా వినవస్తున్నాయి. చుట్టుపక్కల అంతటా పూల వాసనలు వెదజల్లుతున్నాయి. కొండ మీద కూర్చుని వెన్నెలలో చుట్టూ ఉండే దృశ్యాలు రావణుడు చూస్తున్నాడు.



ఆ సమయంలో అప్సరస లందరిలోకీ మిన్న అయిన రంభ, నిద్రలో మునిగి ఉన్న రావణుడి సేనల మధ్యగా నడుచు కుంటూ అటుగా వచ్చింది. ఆమె దివ్యా భరణాలు ధరించి, దివ్య పుష్పమాలలు వేసుకుని, తలలో మందారాలు పెట్టు కుని, నల్లని ముసుగు వేసుకుని, రెండో లక్ష్మిదేవి లాగా రావటం చూసి రావణుడు కూర్చున్నచోటి నుంచి మెల్లగా లేచి వెళ్ళి, ఆమె చెయ్యి పట్టుకుని, "ఇప్పుడు నువు ఎవరిదగ్గిరికి పోతున్నావు? ఎవడా అదృష్ట శాలి? నేను వాడికేమీ తక్కువ వాణ్ణి కాను. మూడు లోకాలలోనూ నన్ను మించినవాడు లేడు. నిన్ను చేతులు మోడ్చి వేడుకొంటాను. నా దగ్గరికి రా," అన్నాడు.

రంభ అతని మాటలు విని వణికి పోతూ, "మీరు నాతో ఇలా మాట్లాడ కూడదు. నాకు ఇతరులు బాధ కలిగిస్తే రక్షించవలసినవారు. నేను మీకు కోడలు వరసదాన్ని. మీ అన్న కొడుకు నలకూబ రుడు నాకోసం వేచి ఉన్నాడు. నే నతన్ని తప్ప మరెవ్వరినీ ప్రేమించలేను," అని వేడుకున్నది.

అయినా, రావణుడు ఆ మాటలు పట్టించుకోకుండా ఆమెను అవమా నించాడు.

రంభ పుట్టెడు సిగ్గుతోనూ, భయం తోనూ, పట్టరాని దుఃఖంతోనూ వెళ్ళి నలకూబరుడి కాళ్ళ మీద పడి, రావణుడు తనకు చేసిన అన్యాయం గురించి చెప్పింది.

నలకూబరుడు కోపోద్రేకంతో జలం స్పృశించి, "ఈ రావణుడు ఇక ముందు తనను కోరని స్త్రీని అవమానించే పక్షంలో వాడి తల వెయ్యి ముక్కలవుతుంది," అని శపించాడు.

ఈ శాపం సంగతి విన్నాక రావణుడు చెరబట్టి తెచ్చిన స్త్రీలలో పతివ్రత లైన వాళ్ళు పరమానందం చెందారు. రావణుడు కూడా అది మొదలు స్త్రీలను అవమా నించడం మానుకున్నాడు.

రావణుడు కైలాసం నుంచి బయలు దేరి తన సైన్యాలను స్వర్గం పైకి నడిపించుకు వెళ్ళాడు. రాక్షస సేన నాలుగు వైపుల నుంచీ స్వర్గాన్ని ముట్టడించుతున్నదన్న వార్త విని, ఇంద్రుడు దేవగణాలను యుద్ధానికి సిద్ధం రమ్మని హెచ్చరించి, విష్ణువు వద్దకు వెళ్ళి, "రావణుడు దండెత్తి వచ్చాడు. ఏం చేసేటట్టు ? నీ సహాయంతో పూర్వం ఎందరో రాక్షసులను అవలీలగా జయించాను. ఇప్పుడు చక్రం పట్టుకుని వెళ్ళి రావణుడితో యుద్ధం చేస్తావా ?" అని అడిగాడు.



"నే నిప్పుడు వాడితో యుద్ధం చెయ్యను. వాడు మన చేతిలో చావడు. వాడి కింకా కాలం తీరలేదు. ప్రస్తుతానికి నువే వాణ్ణి ఎదిరించు. నీ కేమీ భయం లేదు," అన్నాడు విష్ణువు.

దేవతలకూ, రాక్షసులకూ గొప్ప యుద్ధం జరిగింది. రావణుడి బలాలకు అతని తాత అయిన సుమాలి నాయకత్వం వహించి, ఈ యుద్ధంలో సావిత్రు డనే వసువు చేతిలో చనిపోయాడు. రాక్షస సేన కూడా బాగా దెబ్బ తిన్నది. పదింట తొమ్మిది వంతుల మంది రాక్షసులు చచ్చారు. ఇంద్రుడు గొప్పగా యుద్ధం చేసి, రావణుణ్ణి ప్రాణాలతో పట్టుకున్నాడు. ఈ సంగతి తెలిసి మేఘనాదుడు తన మాయను ప్రయోగించి, అదృశ్యుడుగా యుద్ధం చేస్తూ వచ్చి, ఇంద్రుణ్ణి పట్టుకుని తన తండ్రిని విడిపించి, "యుద్ధం అయిపోయింది. మనం గెలిచాం. ఇడుగో, ఇంద్రుడు మనకు చిక్కాడు. నువు యథేచ్ఛగా మూడు లోకాలూ ఏలుకోవచ్చు," అన్నాడు.

ఇంద్రుణ్ణి పట్టుకుని మేఘనాదుడు ఇంద్రజిత్తు అయాడు. తన కొడుకునూ, పట్టుబడిన ఇంద్రుణ్ణీ తీసుకుని రావణుడు లంకకు తిరిగి వెళ్ళాడు.

ఇంద్రుణ్ణి విడిపించటానికి దేవతలు బ్రహ్మను వెంటబెట్టుకుని లంకకు వెళ్లారు. బ్రహ్మ, కొలువులో ఉన్న రావణుడితో,



''నీ కొడుకు పరాక్రమం నిజంగా చాలా గొప్పది. దాన్ని చూసి నేను సంతోషించాను. ఇక నుంచీ నీ కొడుకు ఇంద్రజిత్తు అనే పేరుతో ప్రఖ్యాతి పొందుతాడు. వాణ్ణి ఎవరూ జయించలేరు. వాడి సహాయంతో దేవతలను జయించావుగద, ఇక ఇంద్రుణ్ణి విడిచిపెట్టెయ్యి,'' అన్నాడు.

''తాతా, ఇంద్రుణ్ణి విడిచిపెట్టితీరాలనే పక్షంలో నాకు అమరత్వం ఇయ్యి,'' అన్నాడు ఇంద్రజిత్తు.

''నాయనా, ఏ ప్రాణికీ పరిపూర్ణమైన అమరత్వం లేదు,'' అన్నాడు బ్రహ్మ.

''అలా అయితే, నాకూ్కడా పరిపూర్ణమైన అమరత్వం వద్దు. నేను నీకు తృప్తి కలిగే లాగా రోజూ అగ్నిని మంత్రాలతోనూ, హవ్యాలతోనూ అర్చిస్తాను. నేను యుద్ధానికి బయలుదేరే ముందు గుర్రాలు పూన్చినరథం అగ్ని నుంచి రావాలి; దానిపైన నేనున్నంతసేపూ నాకు అమరత్వం ఉండాలి. ఇదే నేను కోరే వరం. నేను అగ్నిని అర్చించటం పూర్తి కాని పక్షంలో చస్తే చస్తానుగాక,'' అన్నాడు ఇంద్రజిత్తు.

బ్రహ్మ దీనికి ఒప్పుకున్న మీదట అతను దేవేంద్రుణ్ణి విడిచిపెట్టేశాడు. ఇంద్రుడితో సహా దేవతలు స్వర్గానికి వెళ్ళిపోయారు.

యుద్ధోన్మాదంతో రావణుడు భూలోకం పర్యటించేటప్పుడు అతనికి కొన్ని అపజయాలు కూడా కలిగాయి. వాటిని గురించి కూడా అగస్త్యమహాముని రాముడికి చెప్పాడు.

వెయ్యి చేతులు గల కార్తవీర్యార్జునుణ్ణి గెలవాలనే ఉద్దేశంతో రావణుడు తన పరివారాన్ని వెంటబెట్టుకుని మాహిష్మతీ నగరానికి వెళ్ళాడు. అర్జునుడు ఆ రోజే తన భార్యలతో సహా నర్మదానదిలో జలక్రీడలాడటానికి బయలుదేరి వెళ్ళినట్టు తెలిసింది.

రావణుడు సపరివారంగా తాను కూడా నర్మదానదికి వెళ్ళి, అక్కడ స్నానం చేసి, శివపూజ చెయ్యటానికి కూర్చున్నాడు.

అతని మంత్రులు పూజా పుష్పాలు తెచ్చి నదీతీరాన పెద్ద పోగుపోశారు. రావణుడు తన వెంట ఎప్పుడూ ఉండే బంగారు లింగాన్ని ఒక ఇసుక తిన్నె మీద పెట్టి; అర్చించి, దాని ముందు పాడుతూ నాట్యం చెయ్యసాగాడు.



నర్మదానది తూర్పు నుంచి పడమరగా ప్రవహించి, పడమటి సముద్రంలో పడుతుంది. అలాటి నది ఇప్పుడు పడమర నుంచి తూర్పుగా ప్రవహించసాగింది. అంతేగాక నది అంతకంతకూ పొంగి, రావణుడు పూజించిన పుష్పాలను తనతో బాటు తీసుకుపోయింది. అది చూసి రావణుడు చిటికెలు వేసి శుకసారణులను పిలిచి, నర్మద ఎదురు ప్రవహించడానికి కారణం ఏమిటో తెలుసుకు రమ్మన్నాడు.

వాళ్ళు వెళ్ళి చూసేసరికి కార్తవీర్యార్జునుడు తన భార్యలతో జలక్రీడలాడుతూ కనిపించాడు. అతను తన వెయ్యి చేతులతోనూ నదీ ప్రవాహాన్ని అడ్డేసరికి, నది పొంగి ఎదురు ప్రవహించుతున్నది. శుకసారణులు తిరిగి వచ్చి రావణుడితో ఈ సంగతి చెప్పారు. వాళ్ళు వర్ణించిన 'మహావృక్షం' లాటి మనిషి కార్తవీర్యార్జునుడే అయి ఉంటాడని గ్రహించి, రావణుడు యుద్ధానికి బయలుదేరి వచ్చి, కార్తవీర్యార్జునుడి మంత్రులతో, "రావణుడు యుద్ధానికి పిలుస్తున్నాడని మీ రాజుతో చెప్పండి," అన్నాడు.

"యుద్ధానికి మంచి సమయం చూశావే! రాజు స్త్రీలతో జలక్రీడలాడేటప్పుడు యుద్ధానికి పిలుస్తారా? రేపు వచ్చి నీ చేతుల తీట తీర్చుకో," అన్నారు మంత్రులు. కాని రావణుడు అప్పుడే యుద్ధం కావాలన్నాడు. కార్తవీర్యార్జునుడి మంత్రులు తమతో ముందు యుద్ధం చెయ్యమన్నారు.

ఉభయ పక్షాలవారికీ యుద్ధం జరిగింది. రాక్షసులు విజృంభించి అర్జునుడి

పరివారంలో చాలామందిని చంపారు. కొందరిని తిన్నారు కూడా. ఈ యుద్ధపు కోలాహలం విని కార్తవీర్యార్జునుడు తన భార్యలకు భయపడవద్దని చెప్పి, గద తీసుకుని, దాన్ని తన అయిదువందల చేతులతోనూ గిరగిరా తిప్పుతూ, అమిత వేగంతో యుద్ధం జరిగే చోటుకి వచ్చాడు. ప్రహస్తుడు ముసలం తీసుకుని అతని దారికి అడ్డంగా నిలబడ్డాడు. అర్జునుడు ప్రహస్తుడు విసరిన ముసలాన్ని తన గదతో విరగగొట్టి అతనివెంట పడ్డాడు. గదతో కొట్టిన దెబ్బలకు ప్రహస్తుడు పడిపోగానే మారీచ శుకసారణ ధూమ్రాక్ష మహోదరులు మొదలైనవారు అక్కడి నుంచి పారిపోయారు.

ఆ తరవాత రావణుడు అర్జునుడితో యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ గదలతో ఒకరినొకరు మోదుకున్నారు, కాని కొండల్లాగా ఏ ఒకరూ చలించలేదు. చిట్టచివరకు అర్జునుడు బలంకొద్దీ తన గదతో రావణుడి రొమ్ము మీద కొట్టేసరికి, అది తుంపులు తుంపులైపోయింది. అయితే ఆ దెబ్బతో రావణుడు వివశుడై పడిపోయాడు. వెంటనే అర్జునుడు రావణుణ్ణి పట్టి కట్టేసి, తన పట్టణానికి తీసుకుపోయాడు.

ఈ సంగతి స్వర్గంలో ఉన్న పులస్త్య బ్రహ్మకు తెలిసింది. ఆయన మాహిష్మతికి ఆదరా బాదరా వచ్చాడు. కార్తవీర్యార్జునుడు ఆయనకు ఎంతో భక్తిగా అతిథి సేవచేసి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"నాయనా, లోకాలన్నీ జయించి అజేయుడనిపించుకున్న నా మనమణ్ణే గెలిచావు. ఏమి నీ పరాక్రమం! ఏమి నీ కీర్తి! వాణ్ణి విడిచిపెట్టెయ్యి." అన్నాడు పులస్త్యుడు.

కార్తవీర్యార్జునుడు మారు మాటాడక రావణుడి కట్లు విప్పి, అగ్నిసాక్షిగా అతనితో అహింసా స్నేహం చేసుకుని, వస్త్రాభరణాలు కానుకగా ఇచ్చి పంపేశాడు.





# కాకతాళీయం

పట్నంలో చదువు ముగించి, రాముడూ, కృష్ణుడూ అనే ఇద్దరన్నదమ్ములు స్వగ్రామం చేరారు. అయితే, వాళ్ళు పాతికేళ్ళు నిండుతున్నా, ఎలాంటి ఉద్యోగ ప్రయత్నమూ చేయలేదు. పగలు భోజనం చేశాక, ఏ పాడుబడిన ఇంటి అరుగు మీదనో కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకోవడమో, జూదం ఆడడమో చేసేవారు. తండ్రి కొద్దిపాటి ఆస్తిపరుడు కావడంతో, ఇద్దరికీ తిని కూర్చోవడం బాగా అలవాటై పోయింది. ఎక్కడైనా ఉద్యోగం కోసం ప్రయత్నించాలంటే, అన్నదమ్ములకు వల్లమాలినబద్ధకం.

తండ్రి చూసిచూసి, ఒకనాడు రాముణ్ణీ, కృష్ణుణ్ణీ గట్టిగా చీవాట్లుపెట్టాడు. దానితో రాముడు, "ఒరే, కృష్ణా! ఉద్యోగం సంపాయించడం చాలా కష్టం. ఆ తర్వాత దాన్ని నిలబెట్టుకోవడం మరీ కష్టం. మనకేదో తినడానికింత వున్నది. నేనొక ఉపాయం చెబుతాను వింటావా?" అని తమ్ముణ్ణి అడిగాడు.

సరే, ఆ ఉపాయమేమిటో చెప్పమన్నాడు, కృష్ణుడు.

"మనం ఉదయం భోజనం చేయగానే, ఉద్యోగ ప్రయత్నంలో పట్నం వెళుతున్నట్టు, ఇంట్లో చెబుదాం. తర్వాత బయలుదేరి, ఊరవతల ఎక్కడైనా మంచి ప్రదేశం చూసుకుని, అక్కడ సాయంత్రంవరకూ కాలక్షేపం చేసి, ఇంటికి తిరిగివద్దాం. ఇక, ఇంట్లో రాత్రి భోజనం వుండనే వున్నది. ఏమంటావు?" అన్నాడు రాముడు.

కృష్ణుడికి, ఈ ఉపాయం నచ్చింది. వాడు సరేనన్నాడు. ఆ మర్నాడు ఇద్దరూ భోజనాలు చేసి బయలుదేరారు. వాళ్ళు ఊరి పొలిమేర దాటగానే, ఒక డొంక

మాచిరాజు కామేశ్వరరావు



దారి పక్కగా పెద్ద రావిచెట్టొకటి కనిపించింది.

''ఇది భేషైనచోటు. ఎండవేళ చిన్న కునుకు తీయాలనుకుంటే మంచి నీడ!'' అన్నాడు కృష్ణుడు.

''అవును, సుమా! ఇక్కడ కొద్దిమేర శుభ్రం చేసుకుంటే—గంటల్ని క్షణాల్లా గడిపేయొచ్చు, ఈ చెట్టు నీడలో,'' అన్నాడు రాముడు.

ఇద్దరూ చెట్టుకింద వున్న ఎండుటాకులూ, చిన్న రాళ్ళూ ఏరి దూరంగా పారవేయసాగారు.

ఆ సమయంలో, ఆ దారిన ఊళ్ళోకి పోతున్న తులశమ్మ అనే ఆవిడ, వాళ్లను చూసి, ''ఎప్పుడూ ఊళ్ళో కొయ్యదిమ్మల్లా పడుండే మీరు, ఊరవతల యిక్కడ పని చేస్తున్నారేమిటి? విడ్డూరంగా వున్నదే!'' అంటూ వాళ్ళను పలకరించింది.

ఈ తులశమ్మ, బాగా డబ్బుగలావిడ; బాగా తిక్కమనిషి. కొందరావిణ్ణి మందమతి అని కూడా అనుకుంటారు.

''మన ఊళ్ళో అందరికోసం, ఇక్కడ కష్టపడుతున్నాం, అత్తయ్యా. ఇక్కడ గుడి కడతాం!'' అన్నాడు రాముడు వేళాకోళంగా.

''రామకృష్ణుల గుడి,'' అన్నాడు కృష్ణుడు.

''ఎంత మంచిపని చేస్తున్నార్రా! కట్టబోయే గుడికి, నా విరాళంగా, యీ గాజులు వుంచుకోండి. పని మాత్రం వేగిరం ముగించండి,'' అంటూ తులశమ్మ, తన చేతిగాజులు రెండూ తీసి, రావిచెట్టు మొదట్లో పెట్టి, ఊళ్ళోకి వెళ్ళిపోయింది.

ఎండలో తళతళమంటున్న, ఆ గాజుల్ని చూడగానే, రామకృష్ణుల కళ్ళు మెరిశాయి.

''ఎలా లేదన్నా నాలుగువేల ఖరీదు చేసే గాజులు! పట్నం పట్టుకుపోయి, అమ్మేద్దాం,'' అన్నాడు రాముడు.

''ఇంక ఆలస్యం ఎందుకు? ఆ తిక్క తులశమ్మ, ఇంట్లో చెప్పిందంటే, నాన్న

పరుగున వస్తాడు. ముందు డబ్బు చేసుకుని, మాకేం తెలియదని బొంకేద్దాం,'' అన్నాడు కృష్ణుడు.

ఇద్దరూ పట్నం చేరేసరికి మిట్ట మధ్యాహ్నం అయింది. బజారులో ఒక చోట వాళ్ళకు నగలదుకాణం ఒకటి కనిపించింది.

రాముడు, కృష్ణుడితో, ''ఒరే, మనకు, ఈ రోజు బంగారం ధర తెలియదు. నేను దుకాణం బయటే వుంటాను. నువ్వు దుకాణంలోకి పోయి, గాజులు కొనే వాడిలా బేరం చేసి ధర తెలుసుకున్నాక, మన దగ్గర ఉన్న వీటిని అమ్మజూపుదాం. లేకపోతే సగం ధర కూడా గిట్టదు,'' అన్నాడు.

తరవాత, వాడు నగలదుకాణం ఎదురుగా, ఒక ఇంటి అరుగు మీద, గాజుల్ని రొండినదాచుకుని కూర్చున్నాడు.

కృష్ణుడు దుకాణంలోకి వెళ్ళి, ''మంచి గాజుల జతకావాలి. ఈ రోజు బంగారం ధర ఎలా వుంది?'' అని షావుకారును అడిగాడు.

దుకాణంలోని పనివాళ్ళు భోజనాలకు వెళ్ళడంతో, షావుకారే రకరకాల గాజుల జతలు తీసి, కృష్ణుడికి చూపుతూ, ''ముందు నచ్చిన జత ఎంచుకోండి. పనితనాన్నిబట్టి ధర వుంటుంది,'' అన్నాడు.

కృష్ణుడు గాజులు చూస్తూండగా, ఖరీదైన దుస్తులలో ఒక మనిషి వచ్చి, ''కొత్తరకపు హారాలు చూపించండి. దేని





ధరా పదివేలకు తక్కువలో వుండకూడదు," అన్నాడు.

షావుకారు రకరకాల హారాలు తెచ్చి, అతని ముందుపెట్టి, ఒక్కొక్కదానినిగురించిన పనితనపు వివరాలు చెప్పసాగాడు.

కృష్ణుడు తమ దగ్గిర వున్న గాజుల జత రకం గాజులు, షావుకారుకు చూపి, "వీటి ధర ఎంతో చెప్పండి!" అని అడిగాడు.

షావుకారు, ఆ గాజులు తీసుకుని, ధర చెప్పేందుకు ఆలోచిస్తూండగా, ఖరీదైన దుస్తుల్లో వచ్చిన మనిషి కోపంగా, "నేను దుకాణంలో వుండగా, దాని యజమాని మరొకరి పని చూడడం, నా జన్మలో జరగలేదు. ఈ అవమానం భరించి ఒక్క క్షణం యిక్కడ వుండను!" అంటూ విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.

మంచి బేరం పోయినందుకు, షావుకారు బాధపడి, హారాలను పెట్టెల్లో పెడుతూ కెవ్వుమని అరిచాడు. ఒక పెట్టెలోని హారం మాయమైంది! అతడి కేక విని, దుకాణం ముందుగా పోతున్న ఇద్దరు రక్షకభటులు లోపలికి వచ్చారు.

ఇది చూసి, కృష్ణుడు చల్లగా బయటికి జారుకోవాలని చూశాడు. అయితే, రక్షకభటులు, వాడి చేయి పట్టుకుని, "ఏం కొనాలని వచ్చావు?" అని అడిగారు కటువుగా.

కృష్ణుడి నోటమాట పెగలలేదు. షావుకారు, రక్షకభటులతో, "నేను ఈ కుర్రవాడికి గాజులు చూపిస్తూండగా, కోపం వచ్చినట్టు నటించి, ఆ దొంగవెధవ, పన్నెండువేల ఖరీదు చేసే హారం ఎత్తుకుపోయాడు," అన్నాడు.

రక్షకభటులు, కృష్ణుడి కేసి అనుమానంగా చూస్తూ, "చూడబోతే, వాడూ— వీడూ తోడుదొంగల్లా వున్నారు. బంగారం గాజులు కొనడానికి వచ్చిన, నీ దగ్గిర ఎంత డబ్బుందో, చూడనీ!" అంటూ కృష్ణుడి దుస్తులు వెతికారు.

కృష్ణుడి దగ్గిర ఒక్క పైసా కూడా లేదు. అప్పుడు, రక్షకభటులు, కృష్ణుడి మెడ పట్టుకుని, "నీ తోడుదొంగ పేరే



మిటి ? ఎక్కడ వుంటాడు ?'' అని గద్దించి అడిగారు.

కృష్ణుడు కళ్ళనీళ్ళు పెట్టుకుని, జరిగిన దంతా వాళ్ళకు చెప్పి, ''తులశమ్మత్తతో, వేళాకోళంగా అన్నమాటా, నేను దుకాణంలో వుండగా, ఆ ఘరానా దొంగ రావడం—ఇదంతా, కాకతాళీయం అన్న సామెతలా జరిగి, మేం చిక్కులో పడిపోయాం. కావాలంటే రాముడి దగ్గిరున్న బంగారుగాజులు తీసుకుని, మమ్మల్ని వదిలెయ్యండి,'' అన్నాడు.

అయితే, రాముడు దుకాణంలో షావుకారు పెట్టిన కేకలూ, రక్షకభటులు లోపలికి వెళ్ళడం చూసి, ఏదో గొడవ జరిగిందని, పక్కనే వున్న సందులోకి పారిపోయాడు. కృష్ణుడు, రక్షకభటుల్ని దుకాణంలోంచి బయటికి తీసుకువచ్చి చూస్తే, రాముడు ఎదురింటి అరుగు మీద కనిపించలేదు.

''ఇంత చిన్న వయసులోనే, నేర్పుగా అబద్ధాలాడడం ఒంటపట్టిందన్నమాట ! పదకచ్చేరీకి,'' అని రక్షకభటులు, కృష్ణుణ్ణి వెంటబెట్టుకుని బయలుదేరారు.

ఈలోపల రాముడు, పక్కసందులో చాలా దూరం పరిగెత్తి, రాచబాట మీదికి వచ్చి, ఒక బాడుగబండిని ఆపాడు. అప్పటికే అందులో ఒకతను వున్నాడు.

అతడు రాముణ్ణి, "ఎక్కడికి ప్రయాణం? బండి అతనికి చెప్పావు కాదే,'' అన్నాడు.

ఏదో ఒకటి చెప్పక తప్పదు గనక, రాముడు, ''మా మేనత్తకు ఒంట్లో బాగా లేదు. వైద్యం చేయించాలి. ఈ గాజులు అమ్మి డబ్బు తెద్దామని పట్నం వచ్చాను,'' అంటూ గాజులు, ఆమనిషికిచూపించాడు.

అతను, ఆ గాజులు తీసుకుని, అటూ ఇటూ తిప్పి చూసి, ''నన్నేం వెర్రిబాగుల వాడనుకుంటున్నావా ! నేను, ఇవి పూత బంగారం గాజులని, కళ్ళు మూసుకుని కూడా కనిపెట్టగలను,'' అంటూ, వాటిని పక్కనే వున్న మురుగుకాలవలోకి గిరవాటు వేశాడు.

రాముడు ఒక క్షణం నిర్ఘాంతపోయి, అంతలోనే తేరుకుని, పట్టరాని కోపంతో, "నా గాజుల్ని, అలా పారవేయడానికి, నువ్వెవడివిరా!" అని, అతడి మీద కలబడ్డాడు.

ఆ ఇద్దరి తన్నులాటలో, బండివాడు పట్టుతప్పి కిందపడ్డాడు. బండి అదుపు తప్పి, పక్కనున్న కాలవలో పడిపోయింది. రాముడూ, వాడితో దెబ్బలాడుతున్న వాడూ, బండిలోంచి బయటికి దూకేశారు.

ఆ సమయంలో, కృష్ణుణ్ణి, కచేరికి తీసుకుపోతున్న రక్షకభటులు, అటుగా వచ్చారు. కృష్ణుడు, వాళ్ళకు రాముడి పక్కనున్నవాణ్ణి, వాళ్ళకు చూపుతూ, "వాడే, దుకాణంలోంచి హారం కాజేసుకుపోయినవాడు. ఆ పక్కనున్నది, మా అన్న రాముడు," అన్నాడు.

రక్షకభటులు, వాణ్ణి సోదాచేయగా, దొంగిలించిన హారం బయటపడింది.

"అంటే, భాగాలు కుదరక, మీ అన్న వీడితో దెబ్బలాడుతున్నాడన్నమాట! ముగ్గురు తోడుదొంగలు. పదండి, కచేరికి," అని, రక్షకభటులు ముగ్గుర్నీ కచ్చేరీకి తీసుకుపోయారు.

అక్కడ రాముడూ, కృష్ణుడూ కొత్వాలుకు, మరొకసారి జరిగినదంతా చెప్పారు. కొత్వాలు నిజానిజాలు తెలుసుకునేందుకు, వాళ్ళ తలిదండ్రుల్నీ, తులశమ్మనూ పిలిపించాడు. వాళ్ళు నిర్దోషులని తేలిపోయింది.

ఇంత గొడవకూ కారణం అయిన తులశమ్మ, రాముడూ, కృష్ణులతో, "ఒరే, మీది వేళాకోళం అని గ్రహించే, పూత బంగారం గాజులు యిచ్చాను. ఊళ్ళో గుళ్ళు చాలా వున్నవి; బడేలేదు. చదువుకున్న మీరు బడిపెట్టి, పిల్లలకు చదువు చెబుతానంటే, ఈసారి నిజం బంగారం గాజులే ఇస్తాను," అన్నది.

ఇంత జరిగాక, రాముడూ, కృష్ణుడూ ఇక చదువుకున్న సోమరుల్లా తిరగడం క్షేమం కాదనుకున్నారు. ఏడాది తిరగకుండానే, చల్లని రావిచెట్టు నీడలో, తులశమ్మ బడి ప్రారంభమైంది.





# అపకారికి ఉపకారం

విశాలదేశాన్నేలే కీర్తిసేనుడికి, ఒక్కగా నొక్క కుమార్తె. ఆమె పేరు ప్రియంవద. ఆమె గొప్ప సౌందర్యవతే కాక, గురువుల ద్వారా, రాజకుమార్తెకు అవసరం అయిన అన్ని విద్యలూ నేర్చుకున్నది. అయితే, ఆమె పుట్టగానే జాతకం చూసిన ఆస్థాన జ్యోతిష్కుడు, రాజూ, రాణీలకు ప్రియంవద భవిష్యత్తును గురించిన కొన్ని వింత విషయాలు చెప్పాడు.

ప్రియంవదకు పాముకాటు ప్రమాదం వున్నది; ఆమె ఒక సామాన్యుణ్ణి వివాహం ఆడుతుంది.

తమ ఆస్థాన జ్యోతిష్కుడు, జ్యోతిశ్శాస్త్రంలో నిధి అన్న నమ్మకం, కీర్తిసేనుడికీ, రాణీకీ వున్నది. తమ కుమార్తెను రానున్న ప్రమాదాల నుంచి కాపాడుకునేందుకు వాళ్ళొక పథకం వేశారు. అదేమంటే—ప్రియంవద, ఏ రాజకుమారుణ్ణో వివాహం ఆడేవరకూ, ఆమె తనకు విద్య నేర్పే గురువులనూ, దాసీలనూ తప్ప, మరే పురుషుణ్ణీ చూడకుండా గట్టి కట్టుదిట్టం చేయడం.

ప్రియంవద పెంపకం, తల్లిదండ్రులు ఆశించిన విధంగానే సాగి, పదహారు సంవత్సరాలు నిండినై. అప్పటి నుంచీ కీర్తిసేనుడు తీవ్రంగా వరాన్వేషణ ప్రారంభించాడు. అన్ని విద్యలలోనూ సాటి లేని మేటి రాజకుమారుడిని వెతికి, తన అల్లుడుగా చేసుకోవాలని, ఆయన ఆశ పడుతున్నాడు.

ఇలా వుండగా—ఒక పౌర్ణమినాటి రాత్రి, ప్రియంవద చెలికత్తెలు ఎవరూ వెంట లేకుండా, ఒంటరిగా ఉద్యాన వనంలో విహరిస్తున్నది. అప్పుడు, ఎక్కడి నుంచో ఒక నల్లని నాగుపాము వచ్చి, ఆమె ముందు పడగవిప్పి ఆడసాగింది.

“వసుంధర”



ప్రియంవద పామును గమనించలేదు. ఆమె సంపెంగపూలను వాసన చూస్తూ పరవశించిపోయి, కొద్దిసేపటి తర్వాత, ఒక పూవును ముక్కుకానించుకుని అలా విసిరింది.

ప్రియంవద విసిరిన పువ్వు, పడగవిప్పి ఆడుతున్న నాగుపాము పడగకు తగిలింది. పాము వెంటనే బుస్సుమన్నది. ఆ శబ్దం వింటూనే ఆమె ఉలిక్కిపడి, అటు చూసింది. ఎదురుగా నాగుపాము!

ప్రియంవద భయకంపితురాలై పోయింది. నాగుపాము ఒక్కక్షణం పడగ పైకెత్తి, ఆమె కేసి చూసి, జర్రున ముందుకు వచ్చింది. ఆమె పారిపోవాలనుకున్నది కాని, కాళ్ళను కదిలించలేక పోయింది. ఆమె భీతితో కెవ్వుమంటూ అరిచింది.

ఆ మరుక్షణం, భటు డొకడు పరిగెత్తు కుంటూ అక్కడికొచ్చి, నాగుపాము తోక పట్టుకుని, గిరిగిర తిప్పి, నేల కేసి ఒక సారి బలంగా మోది, దూరంగా పార వేశాడు.

ప్రియంవద వెంటనే తేరుకుని, భటుడి కేసి చూసింది. వాడు యువకుడు, మంచి అందగాడు. ఆమె అలాంటి రూపవంతుణ్ణి ఇంతవరకూ చూసి వుండలేదు. పైగా, తను భయంతో కేక వెయ్యగానే, అత డక్కడికి ఎలా వచ్చాడో, ఆమెకు అర్థం కాలేదు.

ప్రియంవద, భటుణ్ణి, "ఎవరు నువ్వు?" అని అడిగింది.

"నేను, తమ సేవకుణ్ణి. ఉద్యానవన కాపలా భటుణ్ణి, రాజకుమారీ!" అని జవాబిచ్చాడు వాడు.

రాజకుమారి తనను చూడకపోయినా, కాపలా భటుడుగా, వాడు రాజకుమారిని దూరంగా వుండి చాలాసార్లు చూసి వున్నాడు.

"సమయానికి వచ్చి, నా ప్రాణం కాపాడావు. నీకేం కావాలో కోరుకో," అన్నది ప్రియంవద.

''నాకే కోరికలూ లేవు,'' అన్నాడు భటుడు.

''ఈ ప్రపంచంలో, కోరిక లుండని వారుండరు. సందేహించకుండా, నీ మనసులో ఎటువంటి కోరిక వున్నాసరే, చెప్పు!'' అన్నది ప్రియంవద.

''మనిషికి స్వర్గం చూడాలని వుంటుంది; దేవుణ్ణి చూడాలని వుంటుంది. ఇలాంటి కోరికలెవరైనా తీర్చగలరా?'' అని అడిగాడు భటుడు.

''నేను తీర్చగల కోరికలేమీ, నీకు లేవా?'' అన్నది ప్రియంవద.

''తమరు, నా కోర్కెను తీర్చగలరు; కానీ తీర్చరు. ఒకవేళ, తమరు నా కోర్కెను తీర్చుతానన్నా, నేనంగీకరించను,'' అన్నాడు భటుడు.

''ఏమిటీ, నీ కోరిక?'' అన్నది ప్రియంవద, భటుడి మాటలకు ఎంతో ఆశ్చర్యపోతూ.

''రాకుమారీ! నేను, తమను ప్రేమిస్తున్నాను. కాని, మన పెళ్ళి అసాధ్యం. ఎందువల్లనంటే, నేను తమను ప్రేమిస్తున్నట్టు తెలిస్తే, ప్రభువులు, నా తల తీయించేస్తారు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను; నా ప్రాణాన్ని ప్రేమిస్తున్నాను. బతికుంటే రోజూ మిమ్మల్ని చూస్తూండవచ్చు,'' అన్నాడు భటుడు.



ఆ మాటలకు ప్రియంవద తెల్లబోయింది. భటుడు నిజమే చెప్పాడు! వాడిని పెళ్ళాడడం, తను సులభంగా తీర్చగల కోరికే—కాని, ఆ కోరిక తను తీర్చలేదు. ఈ విషయం తెలిస్తే, తన తండ్రి కోపగించుకోవడమే గాక, భటుడి తల తీయించినా, తీయించవచ్చు! అయితే, తను ఇప్పుడేం చేయాలి? ప్రాణాలకు తెగించి తనను పాముకాటు నుంచి రక్షించిన భటుడి కోరిక కూడా తీర్చలేకపోతే, తను రాజకుమారి అయుండీ ఏం ప్రయోజనం?

ప్రియంవద దిగులుగా, ''ఇంతకాలం, నేను చాలా గొప్పదాన్నను కున్నాను.



ఉపకారికి ఉపకారం కూడా చేయలేని, అసహాయురాలినని, యిప్పుడే తెలిసింది. నన్ను క్షమించు !'' అన్నది.

''క్షమించడానికి, నేను తమకు చేసిన ఉపకారం ఏమిటి ? నేను తమ సేవకుణ్ణి. తమను రక్షించుకోవడం, నా బాధ్యత. నా మీద అభిమానం వుంటే, అదేచాలు, రాకుమారీ !'' అన్నాడు భటుడు.

ప్రియంవద ఉద్యానవనం నుంచి, పుట్టెడు దిగులుతో అంతఃపురానికి వెళ్లింది. ఆ సమయంలో కీర్తిసేనుడు, తన భార్య కాంతిమతితో మాట్లాడుతున్నాడు. రాజూ, రాణీ కూడా ప్రియంవద రాకను గమనించ లేదు. వాళ్ళిద్దరూ తనను గురించే మాట్లాడుకుంటున్నారని గ్రహించి, ప్రియంవద అక్కడ వున్న ఒక తెర చాటుకు తప్పుకున్నది.

''నాకు, ప్రియంవద వివాహం గురించి బెంగగా వున్నది,'' అన్నాడు రాజు.

''అవును, నాకూ ఏం చెయ్యాలో తోచడం లేదు. జాతకం ప్రకారం, ప్రియంవద ఏ రాజకుమారుణ్ణో కాక, సామాన్యుణ్ణి వివాహమాడవలసి వున్నది గదా ! మన అస్థానజ్యోతిష్కుడి మాట, ఇంతవరకూ ఏనాడూ తప్పకాలేదు,'' అన్నది రాణి.

తల్లిదండ్రుల మాటలు విన్న ప్రియంవదకు, ఒక విషయం అర్థమైంది. తను పుట్టగానే జాతకం చూసి, అస్థాన జ్యోతిష్కుడు, తను సామాన్యుణ్ణి వివాహం ఆడుతుందని చెప్పాడు. తల్లిదండ్రులకు యిది యిష్టం లేదు !

ఇప్పుడు తనకు పెళ్ళీడు వచ్చింది. ఉద్యానవనంలో, సామాన్యుడైన ఒక భటుడు తన ప్రాణాలు రక్షించి, తనను పెళ్ళాడాలన్న కోరిక వెలిబుచ్చాడు. అంటే—జాతకం ప్రకారమే అంతా జరుగుతున్నదా ?

ప్రియంవద, ఆ రోజంతా బాగా ఆలోచించింది. సామాన్యుడిని వివాహం చేసుకోవాలని తన జాతకంలో రాసి వున్నప్పుడు—అది నిజం కాక తప్పనప్పుడు—తనకు

ఉపకారం చేసిన భటుణ్ణి పెళ్ళి చేసుకో వడంలో తప్పేముంది ?

ఆలోచించిన కొద్దీ ప్రియంవదకు, ఆ భటుణ్ణే వివాహం చేసుకోవాలనిపించింది. అయితే, యీ సంగతి తల్లిదండ్రులతో చెప్పడం ఎలా ?

ఆమె, ఇలా ఆలోచిస్తూండగా, అంతఃపురానికి, ఆస్థాన జ్యోతిష్కుడు వచ్చాడు. కీర్తిసేనుడూ, కాంతిమతీ, ఆయనతో రహస్యంగా మంతనాలు ప్రారంభించారు. వాళ్ళ మాటలు విన్న ప్రియంవద భయంతో నిలువునా వణికి పోయింది.

ఆ ముగ్గురూ కలిసివేస్తున్న పథకం ఏమంటే—ఎక్కడినుంచో, ఒక సామాన్య వ్యక్తిని పట్టుకువచ్చి, రహస్యంగా అతడితో, ప్రియంవద పెళ్ళి జరపడం. తర్వాత, ఆ వ్యక్తిని, ఏ విషప్రయోగం ద్వారానో తుదముట్టించడం! ఈ విధంగా చేస్తే, ఆ తర్వాత ప్రియంవద, ఏ గొప్ప రాజకుమారుణ్ణో వివాహం ఆడవచ్చు.

ఇప్పుడు ప్రియంవదకు, ఒక విషయం స్పష్టంగా అర్థమైంది. తను, ఉద్యాన కాపలాభటుణ్ణి, వివాహం చేసుకుంటా నంటే, తన తల్లిదండ్రులు సంతోషంగా ఒప్పుకుంటారు. అది ముగియగానే, అతణ్ణి చంపేస్తారు. ఇంతకన్నా ఘోరం వుండదు!

ప్రియంవద, సాయంత్రం ఒంటరిగా ఉద్యానవనానికి వెళ్ళి, భటుణ్ణి పిలిచి, "నిన్న, నీ పేరు అడగడం మరిచాను. ఇప్పుడు చెప్పు, నీ పేరేమిటి?" అని అడిగింది.

"నా పేరు, జయుడు," అన్నాడు భటుడు.

ఆ వెంటనే ప్రియంవద, "జయా, మనం పెళ్ళి చేసుకుందాం," అన్నది.

"రాకుమారీ, అంతసాహసం నేను చేయలేను. నాకు భయం," అన్నాడు జయుడు.

"ఎలాంటి ప్రమాదం జరక్కుండా, ఒక ఉపాయం చెబుతాను," అన్నది ప్రియంవద. —(ఇంకా ఉంది)



# జోతిష్కుడి ఎన్నిక

శేళ్ళంగేరి దేశపురాజు ఆస్థానంలో, జ్యోతిష్కుడి పదవికి ఖాళీ ఏర్పడింది. ఒక ప్రముఖ జ్యోతిష్కుడికి, ఆ పదవి యివ్వాలనుకున్నాడు, రాజు. అందుకోసం, దేశంలో అంతో, యింతో పేరున్న జ్యోతిష్కులందరినీ ఆహ్వానించాడు. కొన్ని పరీక్షల తర్వాత, ఆ వచ్చినవారిలో, ఐదుగురు జోతిష్యంలో గొప్ప పాండిత్యం వున్నవాళ్ళని తేలింది.

రాజు, వాళ్ళను విడివిడిగా పిలిచి, "మీ జాతకరీత్యా, మీకు ఆస్థాన జ్యోతిష్కుడి పదవి లభించే యోగం వున్నదా?" అని ప్రశ్నించాడు.

దానికి ఐదుగురూ, అలాంటి యోగం వున్నది కనుకనే వచ్చామని జవాబిచ్చారు.

రాజు పెద్ద సందిగ్ధంలో పడ్డాడు. ఈ ఐదుగురిలో, తాను ఒక్కడినే ఆస్థాన జ్యోతిష్కుడిగా నియమిస్తాడు. మిగిలిన నలుగురి జ్యోతిష్యం తప్పవుతుంది. అంటే—వాళ్ళకు జ్యోతిష్యంలో సరి అయిన నిపుణత లేదన్న మాటే కదా! వీళ్ళల్లో, అందరినీ మించిన నిపుణుడెవరు?

మంత్రి, రాజు సందేహం విని, "మహారాజా, వీళ్ళల్లో ఎవరో ఒకర్ని, ఆస్థాన జ్యోతిష్కుడిగా నియమించండి. ఆ తర్వాత, తమ సందేహం తీరుస్తాను," అన్నాడు.

రాజు, రామశాస్త్రి అనే ఆయన్ని ఆస్థాన జ్యోతిష్కుడుగా నియమించి, ఆ సంగతి మంత్రికి చెప్పాడు.

అప్పుడు మంత్రి, "మహారాజా, ఆ ఐదుగురిలో రామశాస్త్రి జ్యోతిశ్శాస్త్రంలో ఉద్దండుడు!" అన్నాడు.

"ఏ ఆధారంతో, అలా చెపుతున్నారు?" అని ప్రశ్నించాడు రాజు.

"ఆస్థాన జ్యోతిష్కులం కాగలమన్న, ఆ ఐదుగురి జోస్యంలో, ఆయన జోస్యమే నిజమయింది కదా!" అని నవ్వాడు మంత్రి. —కోలార్ కృష్ణ అయ్యర్.



## బరువుకు రెండింతల ఆహారం



పుట్టిన నెల్లాళ్ళకు కివీపిల్ల దాదాపు 340 గ్రాముల బరువు మాత్రమే ఉంటుంది. ఇది 24 గంటలలో దాదాపు 800 పురుగులను తింటుంది. అంటే దాని శరీరం బరువుకు రెండింతల ఎక్కువ బరువుగల పురుగులను పట్టి తింటుందన్న మాట!

## లోతైన నది

చైనాలోని యాంగ్ట్సే నది ప్రపంచంలోకెల్లా చాల లోతైనది. ఇరుకైన కొండ మార్గాల గుండా ప్రవహించే ఈ నది లోతు 600 అడుగులు.



## 'రాక్షస' ఈగలు



22 అంగుళాల పొడవు రెక్కలు గల రాక్షస తూనీగలు, 300 మిలియన్ సంవత్సరాల పూర్వం చిత్తడినేల ఉపరితలంలో ఎగురుతూ ఉండేవి. ప్రప్రథమంగా పక్షులు పుట్టడానికి 150 మిలియన్ సంవత్సరాల క్రితం ఈ ఈగలు ఉండేవన్న మాట!

# విజయచిత్ర

డాల్టన్ ప్రచురణ







ఇరవై సంవత్సరాలుగా సినిమా అభిమానులలో
ఉత్తమాభిరుచులను పెంపొందింపజేస్తున్న
మేటి సినిమా పత్రిక

## విజయచిత్ర

విడిప్రతి:రూ. 2.50 | సాలుచందా: రూ 60.00

చందాలు బ్యాంక్ డ్రాఫ్టుద్వారా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు—600 026

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 మార్చి నెల సంచికలో ప్రకటించబడును.



Anant Desai



Anant Desai

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఏం చేస్తే తిరుగుతుంది? రెండవ ఫోటో: ఎటు తోస్తే కదులుతుంది?

పంపినవారు: వక్కలంక రామారావు, మాదేపల్లి–533551 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.




# అంతా సరదాగా, ఉషారుగా వుండబోతోందనే సరికల్లా..ఈ మొటిమలొచ్చి దాన్నంతా పాడుచేసి పారేసాయి

ఆ రోజు కోసం నేను ఎదురుచూసి అలా తయారవుతూన్న సమయం అది—మా స్కూలు వార్షికోత్సవం. టేలంట్ పోటీ, పాటల పోటీలో పాల్గొనడానికోసం, రిహార్సల్ చేస్తూన్నా అంతా చక్కగా సాగిపోతోందనుకున్న సమయంలో ముఖం మీద మొటిమలు వస్తూన్నట్టు చూసాను. ఇదేమిటి....సరిగ్గా యివి యిప్పుడే తయారవ్వాలా. జీవితం ఎంతో హాయిగా సరదాగా వుండబోయే సమయంలోనా....యీ ముఖంతో స్టేజి మీదికెలా వెళ్ళేది.... ఎలా చూపించేది యీ ముఖాన్ని. సరిగ్గా అదే సమయంలో నా ఫ్రెండ్ నా దగ్గరకొచ్చి అంది గదా—

'ఎందుకలా గాబరా పడతావు అనవసరంగా. క్లియరసిల్ వాడు. నేను గూడా వాడాను. తెలుసా నీకది—క్లియరసిల్, మొటిమల్ని తీసిపారేస్తుందలా. అంతే కాదు, అవి యిక పాకకుండా కూడా చేస్తుందిక. నా మాట నమ్మ, అది పనిచేసింది. నేను కూడా క్లియరసిల్ వాడాను. అంది. మరి ఆ తర్వాతంటారా? నేను స్టేజి మీద బహుమానం తీసుకున్నప్పుడు హాలు దద్దరిల్లేలా చప్పట్లు. అప్పుడు నేను లోలోపలే క్లియరసిల్ కి ధన్యవాదాలిచ్చాను, యీ అవకాశం నాకిచ్చినందుకు—అలా మురిపించే క్షణాల్ని నేను పొందేలా చేసినందుకు.

క్లియరసిల్ లోని 3-విధాల చర్య



1. మొటిమలను తెరుస్తుంది



2. బేక్టీరియాను ఎదుర్కొంటుంది



3. మొటిమల్ని ఆరబెడుతుంది




OBM/7991 TL

**క్లియరసిల్** మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స ఎక్కువ ప్రభావంతో పనిచేసేది

A Super treat in every sweet!

SUPER SIZE! SUPER TASTE!

nutrine SuperStar

Premium toffees










TWIN TREAT DELITE TOP CREAM



Heavenly delights



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెని ప్రై. లిమిటెడ్, చిత్తూరు ఆంధ్రప్రదేశ్

CLARION/NC/8636